SUNDAY MAGAZINE

# ఆదివారం ఆంధ్రజ్యోతి

12 ఫిబ్రవరి 2017





## ప్రేమ

*...it happens*



ఫిల్మ్‌నగర్



# 'స్టార్' రెస్టారెంట్లు

షూటింగులు లేకపోతే స్టార్లు ఇంట్లోనే ఉంటారా? 'స్టార్'హోటళ్లకే కాకుండా సామాన్యుల్లాగా సాయంత్రాలు సరదాగా స్నేహితులతో తమ ఫేవరెట్ రెస్టారెంట్లకు వెళ్తుంటారా? ఏ రోజు ఎవరు ఎక్కడికి వెళతారో చెప్పలేం గాని మీరు ముంబాయిలో ఉండటం తటస్థిస్తే బాంద్రాలోని 'హక్కసన్' రెస్టారెంట్‌కో, 'ఆలివ్ బార్ అండ్ కిచన్'కో లేదంటే 'స్మోక్ హౌస్'కో, 'పాలీ విలేజ్ కేఫ్'కో, 'పాలీ భవన్'కో వెళ్లి కూర్చుంటే సల్మాన్‌ఖాన్, కత్రినాకైఫ్, వరుణ్‌ధావన్, రణ్‌బీర్‌కపూర్, శిల్పాశెట్టి, కరణ్‌జోహార్... ఇలా ఎవరైనా తారసపడొచ్చు. అలాగే కొలాబా ప్రాంతంలోని 'వాసబి' రెస్టారెంట్‌కో, మెరీన్ డ్రైవ్‌లోని 'డోమ్' ఇంటర్‌కాంటినెంటల్‌కో, ఖర్‌లోని 'ది కార్నర్ హౌస్'కో వెళితే అక్షయ్‌కుమార్, ప్రియాంకచోప్రా, కరీనాకపూర్, రణ్‌వీర్‌సింగ్, శ్రద్ధాకపూర్, అలియాభట్, సోనమ్‌కపూర్ మీ పక్క సీట్లోనే కూర్చుని డిన్నర్ చేస్తూ కనిపించొచ్చు. అయితే 'స్టార్లు' వెళ్లే రెస్టారెంట్లు కాబట్టి సహజంగానే వాటి 'మెనూ' ఖరీదుగా ఉంటుంది.

















# ఆదివారం ఆంధ్రజ్యోతి

12 ఫిబ్రవరి 2017


## ఇన్‌బాక్స్

### 'వినువీధిలో..' విహరింపచేశారు!

ఒకప్పుడు విమానయానం చేయాలంటే రాసిపెట్టి ఉండాలి అనుకునేవాళ్లం. అప్పట్లో గాలిమోటరు ప్రయాణం శ్రీమంతులకు మాత్రమే సాధ్యమయ్యేది. అయితే ఎగిరే విమానం ఎప్పటికైనా నేలమీదకి దిగి రాకతప్పదు అన్నట్టుగా విమానయాన ధరలు మెల్ల మెల్లగా సామాన్యులకు కూడా అందుబాటులోకి వచ్చాయి. కొన్ని సార్లు రోడ్లమీద ట్రాఫిక్ తగ్గాలంటే ఆకాశంలో ట్రాఫిక్ పెరగడమే మార్గమని అనిపిస్తుంది. కవర్‌స్టోరీ కథనం చదివిన తర్వాత త్వర లోనే ఆ రోజులు వస్తాయనే నమ్మకం కలిగింది. ఎ.సి. బస్సు చార్జీతో ఎయిర్‌బస్ ఎక్కే సౌలభ్యం దొరికితే ఇక ముందు రద్దీని తట్టుకోలేక ప్రతి ఊరికి విమాన సర్వీసులు (ఒక యాడ్‌లో చూపించినట్టుగా) నడపాల్సి ఉంటుందేమో!

**- సూర్యప్రకాశ్,** తాండూరు

### జ్ఞాపకాల పూలు పూశాయి!

'పూల ఋతువు' కథ ఎన్నో జ్ఞాపకాల పూలను విచ్చుకునేలా చేసింది. మరుగున పడిపోతున్న స్వచ్ఛ మైన ప్రేమలను గుర్తుకుతెచ్చింది. యవ్వనంలోని అ'ప రిమిత'మైన 'విశ్వ' ప్రేమలను.. ఆ జ్ఞాపకాల జడివా నను ఎంతో అద్భుతంగా వర్ణిస్తూ రాశారు రచయిత. ఆమె రచనా పరిణతికి చక్కటి ఉదాహరణ ఈ కథ. ప్లాస్టిక్ ప్లేట్లలో కాకుండా అరిటాకుల్లో భోజనం వడ్డిం చిన రచయితకు కృతజ్ఞతలు.

**- కలన,** హైదరాబాద్

•••

'పూల ఋతువు' కథలో 'పరిమిత' యవ్వనంలో తాను ప్రేమించిన కుర్రాడిని తన 70 ఏళ్ల వయసులో కూడా జ్ఞాపకాల్లో నిలుపుకుంటుంది. 'తాను బతికున్నన్నాళ్లు' ఆ జ్ఞాపకాలు అలాగే ఉంటాయంటుంది కూడా. అయితే ఆమె విశ్వాన్ని ఇంతగా ఆరాధిం చడానికి అతను, ఆమె జీవితానికి చేసిన మంచి ఏమిటో అర్థంకాలే దు(యవ్వనవనాన్ని పరిమళింపచేయడం మాత్రమేమా!). ఒకవేళ వీళ్ల ప్రేమ ఫలించి పరిమిత విశ్వాన్నే పెళ్లాడి ఉంటే.. ఆమెలో ఈ స్థాయి ఆరాధన ఇంత కాలం నిలిచి ఉండేదా? అసాధ్యమనే చెప్పాలి. సంసార జీవితంలోని అసంతృప్తి, అలజడులే ఆమెను అలా పాత జ్ఞాపకాల స్పృహలో జీవించేలా చేశాయేమో అనిపి స్తోంది. మొత్తానికి పాత్ర నిర్మాణంలోనే తేడా ఉందనిపిస్తుంది.

**- టి. పావెల్,** విజయవాడ

### సినీ నేలకు 'శుభప్రదం'

నేటి పాటల్లో శబ్ద కాలుష్యం చేసే సంగీతం తప్ప సాహిత్యం కనిపించట్లేదు. అప్పుడప్పుడు వచ్చే కె. విశ్వనాథ్ గారి సినిమాల్లో మాత్రమే మంచి సాహిత్యపు విలువలున్న పాటలు వినిపిస్తుం టాయి. అలాంటి ఉత్తమ సాహిత్యాభిరుచి ఉన్న కళాతపస్విని పాట లతో మెప్పించాలంటే ఎంతటి రచయితకైనా అంతర్మథనం తప్పని సరి. తనకు దక్కిన ఆ అవకాశాన్ని 'తప్పెట్లతో.. తాళాలతో' నింపడం రామజోగయ్య ప్రతిభకు తార్కాణం. 'శుభప్రదం'గా.. మహాశివుడిని, చిలిపి కృష్ణుడిని కలుపుతూ పాట రాయాలనే ఆయన ఆలోచనే అద్భుతం.

**- డి. వెంకట్రావు,** ఉయ్యూరు

### తెలుగుపై కొత్త వెలుగు

'తెలుగు జాడలు' శీర్షికన 'ఆంగ్‌కోర్‌వాట్' గురించి తెలియజేసిన విశేషాలు అబ్బురపరిచాయి. 5 వేల కిలో మీటర్ల దూరంలో ఉన్న కంబోడియాలో కూడా తెలుగు వారి జాడలు ఉన్నాయని తెలుసుకుని ఆశ్చర్యపోయాం. చిక్కుముడుల లాంటి ఎన్నో ప్రశ్నలకు చరిత్ర గర్భంలో మాత్రమే సమాధానాలు ఉన్నాయి. అవి ఎన్నటికి వెలుగు చూస్తాయో ఎదురుచూడాలి.

**- శ్యామ్‌సుందర్,** తెనాలి

### బేతాళ ప్రశ్నలు బాగున్నాయి

'బేతాళ ప్రశ్న'లు చూస్తుంటే త్రిపురనేని శ్రీనివాస్ కవితలు గుర్తుకువచ్చాయి. నిశ్శబ్దంగా, నిశ్చలంగా ఉన్న మా మెదడుకు ఆలోచనలతో పదును పెట్టిస్తున్న ఈ బేతాళుడు మాకెంతో నచ్చాడు. అలాగే 'ఎందుకు?' చదివి ఎన్నో ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకుంటున్నాం. 'ఫోటో కుర్రాడి విజయగాథ' కూడా చాలా బాగుంది. 11 ఏళ్లకే ప్రపంచవ్యాప్తంగా పాపులారిటీ తెచ్చుకోవడమే కాకుండా, దాంతో తన తండ్రి ప్రాణాలు కాపాడుకున్న ఈ చిన్నోడు, కష్టాలలో ఉన్న పేదవారిని ఆదుకోవాలని నిర్ణయించుకుని నిజమైన 'సక్సెస్ కిడ్' అయ్యాడు.

**- వి. ప్రదీప్, వి. పద్మ,** ఉప్పల్

'ఆదివారం అనుబంధం'పై మీ అభిప్రాయాలను శుక్రవారంలోగా అందేలా పంపగలరు. ఆలస్యంగా అందిన ఉత్తరాలు ప్రచురించడం సాధ్యపడదని మనవి. sunday.aj@gmail.com కి మీ ఉత్తరాల్ని మెయిల్ చేయవచ్చు.




# చేతిలో గులాబీతో.. గుండె నిండా ప్రేమతో...

ఈ సారి 'వాలంటైన్స్ డే'కు అబ్బాయిలకో చిట్కా...

మీ లవర్‌కు ఏం కావాలో అడగండి. ఆన్‌లైన్‌లో కొనండి. గిఫ్ట్ డెలివరీ కోసం ఆమె అడ్రస్ అడగండి. 'క్యాష్ ఆన్ డెలివరీ' ఆప్షన్ ఇచ్చి క్లిక్ చేయండి.

వినడానికి ఇది ఫన్నీగా ఉన్నప్పటికీ 'వాలంటైన్స్ డే' నాడు పర్సులు ఖాళీ అవుతున్నాయనేది అబ్బాయిల ఏడుపు (అమ్మాయిలూ వింటున్నారా?). 'వాలంటైన్స్ డే' అంటే ప్రేమను వ్యక్తం చేయడం మాత్రమే. కానీ దాని చుట్టూ 'గిఫ్ట్' రాపర్ చుట్టి అమ్మకాలు సాగించడం మాత్రం కచ్చితంగా మార్కెట్ మాయాజాలమే. వాలంటైన్స్ డే రావడానికి వారం పదిరోజుల ముందుగానే ప్రపంచవ్యాప్తంగా హడావిడి మొదలవుతుంది. పెద్ద పెద్ద షాపింగ్ మాల్స్ దగ్గర నుంచి మార్కెట్లు, హోటల్స్, రెస్టారెంట్లు, గ్రీటింగ్ కార్డులు అమ్మే చిన్నచిన్న షాపుల దాకా అంతటా ఎర్రటి 'ప్రేమ' వాతావరణం ఏర్పడుతుంది.

గత ఏడాది ప్రపంచవ్యాప్తంగా ప్రేమికుల రోజున జరిగిన వ్యాపారం విలువ 12,767 కోట్ల రూపాయలపైనే ఉంటుందని అంచనా. న్యూ ఇయర్ తర్వాత అంత భారీ స్థాయిలో ఖర్చు పెట్టే వేడుక ఇదేనట.

గత ఏడాది ప్రేమికుల రోజున దాదాపు 15 కోట్ల గ్రీటింగ్ కార్డులు అమ్ముడయ్యాయి. వీటిలో 85 శాతం అమ్మాయిలు కొన్నవే కావడం విశేషం. అబ్బాయిల్లో 15 శాతం మంది మాత్రమే గ్రీటింగ్ కార్డులు కొనడానికి ఇష్టపడుతు న్నారట. మిగిలిన వారంతా 'గిఫ్ట్'ల ద్వారా ప్రేమను వ్యక్తం చేస్తూ శుభాకాంక్షలు చెబుతున్నారు. ప్రేమికుల రోజున గిఫ్ట్ ఇవ్వకపోతే తమ రిలేషన్ బ్రేక్ అవుతుందేమో అనే భయంతో అబ్బాయిలు తప్పనిసరిగా బహుమతులు కొంటున్నారట. వారి భయాన్ని నిజం చేస్తూ వాలంటైన్స్ డే రోజున బాయ్‌ఫ్రెండ్ నుంచి గిఫ్ట్ రాకపోతే 53 శాతం మంది అమ్మాయిలు లవ్‌కు బ్రేకప్ చెబుతున్నారని ఒక సర్వేలో తేలింది. ఎక్కువ మంది అబ్బాయిలు మ్యారేజ్ ప్రపోజల్ తేవడానికి ఎంచుకునే రోజు కూడా ప్రేమికుల రోజే. అందుకే డైమండ్ రింగ్స్, జువెలరీకి కూడా విపరీతంగా డిమాండ్ ఉంటుందీ రోజు.



ప్రేమికుల రోజున మొబైల్ ద్వారా షాపింగ్ చేసేవారి సంఖ్య కూడా ఏటా పెరుగుతోంది. 2015తో పోల్చితే గత ఏడాది మొబైల్ షాపింగ్‌లో 48 శాతం వృద్ధి నమోదైంది. ఇదే సమయంలో ఆన్‌లైన్ షాపింగ్ 35 శాతం పెరిగింది. ఎక్కువ మంది బహుమతిగా ఇవ్వడానికి, తీసుకోవడానికి ఇష్టపడే చాక్లెట్లు, క్యాండీల అమ్మకమైతే కొన్ని వేల కోట్ల రూపాయల్లో ఉంటుంది. అమ్మాయిలు గిఫ్టులు ఇవ్వడం కంటే తీసుకోడానికే ఎక్కువగా ఇష్టపడుతున్నారట!! ఇంకో విషయం 'ప్రేమ' అనేది కేవలం ప్రేయసీప్రియులకే పరిమితమను కుంటే పొరపాటు. వాలంటైన్స్ డే రోజున భర్తల కోసం బహుమ తులు కొంటున్న భార్యలు 22 శాతం మంది ఉంటే, స్నేహితుల కోసం కొంటున్నవారు 20 శాతం మంది దాకా ఉంటున్నారు. 17 శాతం మంది మాత్రమే బాయ్‌ఫ్రెండ్ కోసం కొంటున్నారు.

## సింగిల్ సెలబ్రేషన్స్ ...

ఈ రోజుల్లో ప్రేమ పుట్టినంతసేపు పట్టట్లేదు 'బ్రేకప్' అంటూ విడిపోవడానికి. ప్రేమలో విఫలమైనవారు, 'బ్రేకప్' చెప్పి విడిపోయిన వాళ్లు కూడా హ్యాపీగా, సోలోగా వాలంటైన్స్ డే వేడుకలు జరుపుకుంటున్నారు. 'సింగిల్ సెలబ్రేషన్ ఆఫ్ లవ్' కోసం మగవారు సగటున 4700 రూపాయలకు పైగా ఖర్చు పెడుతుంటే, ఆడవాళ్లు దాదాపు 2700 రూపాయలు ఖర్చు పెడుతున్నారు. నిజానికి వాలంటైన్స్ డే సెలబ్రేషన్స్ ఒక్కరోజులో ముగిసిపోయేవి కాదు వారం పాటు సాగే సంబరం అంటున్నారు ప్రేమ పిపాసులు. ఫిబ్రవరి 7న రోజ్ డేతో వాలంటైన్స్ వీక్ మొదలవుతుంది. ఆ రోజు భాగస్వామికి రోజా పువ్వు ఇస్తే వారిద్దరూ జీవితాంతం కలిసుంటారని ఒక నమ్మకం. తర్వాత రోజు అంటే ఫిబ్రవరి 8న ప్రపోజ్ డే (ప్రేమను వ్యక్తం చేసే రోజు), ఫిబ్రవరి 9న చాక్లెట్ డే, ఫిబ్రవరి 10న టెడ్డీ డే, ఫిబ్రవరి 11న ప్రామిస్ డే (ప్రమాణం చేసే రోజు), ఫిబ్రవరి 12న హగ్ డే, ఫిబ్రవరి 13న కిస్ డే అని జరుపుకుంటారట.

వాలంటైన్స్ డే తర్వాతి ఏడు రోజులకు కూడా పేర్లున్నాయి కాని అవి బహుశా గిట్టనివాళ్లు పెట్టినట్టున్నారు. అవి వరసగా స్లాప్ డే, కిక్ డే, పర్‌ఫ్యూమ్ డే, ఫ్లర్టింగ్ డే, కన్‌ఫెషన్ డే, మిస్సింగ్ డే, బ్రేకప్ డే. వీటి గురించి పట్టించుకోకుండా మొదటి 7 రోజులు హ్యాపీగా జరుపుకోండి. ఆల్ ది బెస్ట్.








పేరడీ

## ('మజ్ను' సినిమాలోని 'ఇది తొలిరాత్రి .. కదలని రాత్రి' పాటకు)

ఇది తొలి పెళ్లి .. ముగియని పెళ్లి
నీకు నాకు నాకు నీకు జరుగుతున్న మొదటి పెళ్లి
ప్రేయసి రావే .. ఊర్వశి రావే ..

పందిరమ్మా అందముగా వెలుగుచున్నదీ
అల్లరమ్మా పిల్లలతో ఆడుచున్నదీ
మంత్రమేమో పంతులచే పలుకుతున్నదీ

వేదికేమో ఇంతులతో నిండియున్నదీ
నీ రాక కొరకు మైకులు
నీ అడుగు కొరకు మీడియా
అరచి అరచి వేచి వేచి అలసిపోతున్నవీ
ప్రేయసి రావే .. ఊర్వశి రావే ...

పందిరంతా ఆకలితో మాడుతున్నదీ
పెద్ద మనసు చూడలేక వాగుతున్నదీ
పిల్ల మాత్రం ప్రియుడితో మాయమైనదీ
పరువు మొత్తం గంగలో మిళితమైనదీ ..
నీ చివరి చూపు వరకు
ఈ ఆగలేని బతుకు
చూసి చూసి విసిగిపోయి వేగిపోతున్నదీ
ప్రేయసి రావే .. ఊర్వశి రావే ...

**- బవనీల జ్ఞానేశ్వర్, 93474 62300**

## 'లవ్ కోట్స్'

- 'ఆకర్షణలో వికసించే ప్రేమ ఆచరణలో వికటిస్తుంది ఆలోచనలో అంకురించే ప్రేమే ఆరు కాలాలు నిలుస్తుంది!'
- 'అమ్మాయి మనసు సముద్ర మంత లోతైతే దాన్ని అర్థం చేసుకునే అబ్బాయికి ఆకాశమంత హృదయం ఉండాలి!'
- 'ప్రేమిస్తే ప్రపంచమంతా తెలియక్కర్లేదు నా ప్రపంచమైన నీకు తెలిస్తే చాలు!'

## అదీ తేడా

"ప్రేమలో ఉన్నోడి నుండి మేజిక్కులూ, ప్రేమలో ఫెయిల్ అయినోడి నుండి లాజిక్కులూ ఆటోమెటిక్‌గా వచ్చేస్తాయి!"

## క్యా డైలాగ్ హై

- ప్రేమంటే కలిసి ఉండటం కాదు. దూరాన్ని కూడా దగ్గరగా ఫీలవ్వడం!

  చిత్రం : **మళ్లీ మళ్లీ ఇది రాని రోజు**

- గొంతులోని మాటైతే నోటితో చెప్పగలం కాని గుండెలోని ప్రేమ కేవలం కళ్లతోనే చెప్పగలం.

  చిత్రం : **నువ్వే కావాలి**




# 'మనీలెస్' గ్రామం

**ఆ ఊరికి కొత్తగా వచ్చినవాళ్లు దుకాణాల్లో ఏదైనా కొనుగోలు చేసి డబ్బులివ్వబోతే... చిరునవ్వులు చిందిస్తూ అదోలా చూస్తారు. "ఊరికి కొత్తా" అని అడుగుతారు. ఇదేమిటి డబ్బులివ్వబోతే నవ్వడమేమిటి అనుకుంటున్నారా! అదే అసలు విషయం. ఆ ఊర్లో జరిగేవన్నీ క్యాష్ లెస్ లావాదేవీలే! 'మనీలెస్' కాన్సెప్ట్‌ను మహోద్యమంగా చేపట్టిన ఆ ఊరు నెల్లూరు నగరానికి కూతవేటు దూరంలో ఉన్న నారాయణరెడ్డిపేట.**

ఒకప్పుడిక్కడ నారాయణరెడ్డి అనే మోతుబరి రైతు ఉండేవారు. ఆయన పేరునే ఈ ఊరికి పెట్టారు. 1847 కుటుంబాలున్న పెద్ద ఊరు అది. అందరూ వ్యవసాయం, పశుపోషణ, ఆక్వాసాగు, చేనేత, చిరు వ్యాపారాలు, చిన్నపాటి ఉద్యోగాలతో నిత్యం బిజీగానే కనిపిస్తారు. ఎవరూ ఖాళీగా కూర్చొని పిచ్చాపాటీ మాట్లాడటం కనిపించదు. వ్యవసాయ కూలిపనులకు వెళ్లేవాళ్లు కూడా ఖాళీ సమయంలో మగ్గం నేయడం, విస్తరాకులు కుట్టడం వంటి పనులు చేస్తూ ఉంటారు.

కేంద్ర ప్రభుత్వం ఇటీవల పెద్ద నోట్లు రద్దు చేసినప్పుడు అందరిలానే ఈ ఊరివాళ్లు కూడా నోట్ల కష్టాలు ఎదుర్కొన్నారు. పాత నోట్లను మార్చుకోలేక, కొత్త నోట్లు తగినన్ని దొరకక నానా కష్టాలు పడ్డారు. ఆ సమయంలో జిల్లా కలెక్టర్ ముత్యాలరాజు, జాయింట్ కలెక్టర్ ఇంతియాజ్ అహ్మద్‌లు నగదు రహిత గ్రామాలను రూపొందించే లక్ష్యంతో జిల్లాలోని ప్రముఖ బ్యాంకు అధికారులతో కలిసి ఒక సమావేశం నిర్వహించారు. ఈ సమావేశంలో 'మొదటి నగదు రహిత గ్రామం' గా నారాయణరెడ్డిపేట గ్రామాన్ని తీర్చిదిద్దాలనే నిర్ణయం తీసుకున్నారు. దానికి అనుగుణంగానే ఆంధ్రప్రగతి గ్రామీణ బ్యాంకు ఆర్.ఎం బి.వి. శివయ్య, ఇతర అధికారులు అతితక్కువ కాలంలో ఒక ప్రణాళికను రూపొందించారు.

మొదట మదిరి శ్రీనివాసులు అనే వ్యక్తిని గ్రామంలో బిజినెస్ కరస్పాండెంట్‌గా నియమించారు. అతను గ్రామంలో బ్యాంకు అకౌంట్లులేని వారందరి చేత కొత్తగా అకౌంట్లు తెరిపించాడు. అందరికీ ఎ.టి.ఎం కార్డులు, రూపే కార్డులు, అవసరమైన వారికి పి.ఓ యంత్రాలు అందజేశాడు. బ్యాంకు అధికారులు మీటింగులు పెట్టి మరీ ఆధార్ కార్డు ద్వారా నగదు లావాదేవీలు జరిపే పద్ధతిని ప్రజలకు నేర్పించారు. చదువుకున్నవారు సెల్‌ఫోన్ల ద్వారా నగదు బదిలీ చేసుకునేలా చర్యలు తీసుకున్నారు. ఎలాగైతేనేం అనుకున్న దాని కంటే ముందుగానే నారాయణరెడ్డిపేట గ్రామాన్ని నగదు రహిత గ్రామంగా తీర్చిదిద్దారు.

డబ్బు కోసం బ్యాంకుకు వెళ్లి గంటలు గంటలు క్యూలైన్లలో నిల్చోవడం అక్కడ కనిపించదు. చిల్లర ఖర్చులకి డబ్బు అవసరమైతే ఒక్క వేలిముద్రతో డబ్బులు తీసుకుంటారు. ఏదైనా కొనుగోలు చేస్తే పి.ఓ యంత్రాల ద్వారా నగదు చెల్లింపులు జరుపుతుంటారు. వ్యవసాయ కూలీలకు చెల్లించే కూలీ డబ్బులు కూడా



సెల్‌ఫోన్ల ద్వారానే వారి అకౌంట్లలో జమచేస్తున్నారు. కూరగాయలు, మాంసం, చేపలు, గుడ్లు, ఇతర నిత్యావసర సరుకులు.. ఏది కొన్నా వీరికిప్పుడు డబ్బుతో పనే లేదు. అన్నీ కార్డు ద్వారానే జరిగిపోతున్నాయి. ఎంతగా అంటే పిల్లలు మిఠాయిలు కొన్నా సరే.. కార్డుతోనే చిల్లర చెల్లిస్తున్నారు.

ఈ ఊరిలో నాలుగువేలకి పైగా బ్యాంకు అకౌంట్లు ఉన్నాయి. వీటి ద్వారా నెలకు 24 లక్షల నుంచి 80 లక్షల వరకూ ఆన్‌లైన్ లావాదేవీలు జరుగుతున్నాయి. ఈ ఊరి ప్రజలను ఆదర్శంగా తీసుకుని చుట్టుపక్కల గ్రామాల వారు కూడా నగదు రహిత లావాదేవీలను అలవాటు చేసుకుంటున్నారు.

ప్రతీ గ్రామాన్ని నగదు రహిత గ్రామంగా మార్చాలనే లక్ష్యంతో, ప్రజలను మనీలెస్ దిశగా అడుగులు వేసే విధంగా చైతన్యపరుస్తూ ఈ కార్యాన్ని ఒక ఉద్యమంలా ముందుకు తీసుకువెళ్లేందుకు కృషి చేస్తున్నారు నెల్లూరు జిల్లా కలెక్టర్, జె.సిలు. ఇప్పటికే జిల్లాలోని బ్యాంకులు ఇరవైకి పైగా గ్రామాలను ఎంపిక చేసి క్యాష్‌లెస్ గ్రామాలుగా తీర్చిదిద్దే ప్రయత్నాలు చేస్తున్నాయి. ఇదే వేగంతో ఈ ఉద్యమం దేశమంతా విస్తరిస్తే బిచ్చగాళ్లకి ఇచ్చే బిచ్చం కూడా కార్డుల ద్వారా ఇచ్చే రోజు త్వరలోనే వస్తుందేమో!.

**- కంచర్ల మహేశ్ బాబు,** ఏబీఎన్ ప్రతినిధి, నెల్లూరు.



# గ్లాసులు చేజారవు

అతిథులకు మంచి నీళ్లు, కూల్‌డ్రింక్స్ సర్వ్ చేసేటప్పుడు పొరపాటున చేయి జారి కింద పడడం అప్పుడప్పుడూ జరుగుతుంటుంది. అవి అతిథుల మీద పడినట్లయితే వాళ్లను ఇబ్బంది పెట్టడమే కాకుండా ఖరీదైన దుస్తులు పాడవుతాయి. వాటి మీద కూల్‌డ్రింక్స్ వంటి పానీయాలు పడితే ఆ మరకలు వదిలించడానికి చాలా కష్టపడాల్సి ఉంటుంది. అలాంటి ఇబ్బందులు లేకుండా చేస్తుంది ఈ 'సేఫ్ ట్రే ఫర్ డ్రింక్స్' ( S సాధారణ ట్రేలానే కనిపించే ఈ ట్రేకు కింద చేతివేళ్లు పెట్టుకునేందుకు వీలుగా చిన్న చిన్న బొడిపెల్లాంటి రంధ్రాలు ఇచ్చారు. ఇవి ట్రే చేతుల లోంచి జారిపోకుండా పట్టుకునేందుకు వీలుగా ఉండడమే కాకుండా గ్లాసులు అటూఇటూ జరగకుండా సపోర్టుగా ఉంటాయి. కాబట్టి ట్రేను కొద్దిగా వంచినప్పటికీ గ్లాసులు కిందపడవు. ఇంట్లో అల్లరి పిల్లలున్న వారికి ఈ ట్రే బాగా ఉపయోగపడుతుంది.




ఈ వస్తువులను వాటి పేరుతో నెట్‌లో సెర్చ్ చేసి, వివిధ ఆన్‌లైన్ సంస్థల ద్వారా కొనుగోలు చేయవచ్చు.

## 'స్క్రూడ్రైవర్' మూత..

వైన్, సోడా, బీర్ వంటి గాజు బాటిల్స్ ఓపెన్ చేసిన తర్వాత క్యాప్ సరిగా పెట్టకపోతే వాటి రుచి పోతుంది. ఈ 'రెడ్‌నెక్ స్క్రూడ్రైవర్ బాటిల్ స్టాపర్' ( R S p e r తో సీసా మూతి బిగిస్తే దీనికున్న రబ్బర్ రింగ్స్ వల్ల అందులోకి గాలి కూడా చొరబడదు. దాంతో లిక్కర్ రుచిలో ఏమాత్రం తేడా రాదు.



## ఈ కుక్కర్‌తో లాభాలు ఎన్నో..

సాధారణంగా కుక్కర్‌ను ఇడ్లీలు, అన్నం లాంటివి వండేందుకు, పప్పులు, మాంసం ఉడికించేందుకు ఉపయోగిస్తుంటాం. అయితే ఈ 'మల్టీపర్పస్ స్టీమర్' ( M S చూసేందుకు సాధారణ కుక్కర్ కంటే చిన్నగా కనిపించినా అనేక రకాలుగా ఉపయోగపడుతుంది. ఈ స్టీమర్‌ను వేపుళ్లు చేసేందుకు బాణలిలా, దోశలు, పొంగనాలు వేసుకునేందుకు పెనంలా, కేక్స్ తయారుచేసేందుకు ఓవెన్‌లా కూడా ఉపయోగించవచ్చు. ఇడ్లీ ప్లేట్లతో పాటు కేక్స్ తయారుచేసేందుకు ఉపయోగించే ప్లేట్లు కూడా విడిగా ఇస్తున్నారు. స్టెయిన్‌లెస్ స్టీల్‌తో తయారుచేసిన ఈ స్టీమర్‌ను శుభ్రపరచడం కూడా సులువే.



కవర్ స్టోరీ

# ప్రేమ it happens




'ప్రేమ' ఒక అందమైన భావన.
'ప్రేమ' ఒక అద్భుతమైన చేతన.

**ప్రేమ పుట్టకుండా, ప్రేమలో పడకుండా ఉండటం ఎవరికీ సాధ్యం కాదేమో. ఈ భూమ్మీద ఇప్పటిదాకా ఎన్నో ప్రేమలు పుట్టాయి. పుడుతూనే ఉన్నాయి. పుడుతూనే ఉంటాయి. ఒక ప్రేమకు మరో ప్రేమకు పోలిక ఉండదు కాబట్టే తరతరాలుగా అది నిత్యనూతనంగా వర్ధిల్లుతూనే ఉంది. ప్రేమికులను సృష్టిస్తూనే ఉంది. ఇంత ఆకర్షణ ఉన్న విషయం కాబట్టే ప్రేమతత్వాన్ని తెలుసుకునేందుకు పురాణాల నుంచి ఇప్పటిదాకా ఎంతోమంది కవులు, రచయితలు, కళాకారులు ప్రయత్నిస్తూనే ఉన్నారు. తమ సృజనతో ప్రేమభావనకు సొబగులు అద్దుతూనే ఉన్నారు. ప్రేమకావ్యాల నుంచి ప్రేమసందేశాల దాకా 'లవ్'లీగా సాగుతున్న ఈ ప్రేమసాగరంలోకి 'ప్రేమికుల దినోత్సవం' (ఫిబ్రవరి 14) సందర్భంగా మనమూ ఓసారి వెళ్దొద్దాం...**

● వాడ్రేవు చినవీరభద్రుడు

ప్రేమ కావాలనుకుంటే కలిగేది కాదు, బలవంతాన అసలే కలగదు. ప్రార్థిస్తే పుట్టేది కాదు, ప్రయాసతో ఫలించేది కాదు. అది సంభవిస్తుందంతే. It happens. అట్లా నీకు ప్రేమ కలిగినప్పుడు... నీలో ఏదో జరుగుతుంది. ఆ జరిగేదేదో నీకై నువ్వు మాటల్లో పెట్టుకోవాలని చూస్తావు. ఆ మాటలే నిన్ను మనిషిని చేస్తాయి.

ప్రతి జాతీ తన కవుల్ని ఎందుకు ప్రేమిస్తుందంటే, వాళ్ళు వారి మూగబాధకి మాటలిస్తారు కాబట్టి.

*'ఈ వేళలో నీవు ఏం చేస్తు ఉంటావో*
*అనుకుంటూ ఉంటాను ప్రతి నిమిషమూ నేను*
*నా గుండె ఏనాడో చెయి జారిపోయింది*
*నీ నీడగా మారి నా వైపు రానంది*
*దూరాన ఉంటూనే ఏం మాయ చేసావో...'*

అనే పాట విన్నప్పుడు నాకు తెలిసిన ఒక 22, 23 ఏళ్ళ యువతి కళ్ళల్లో కన్నీళ్ళు ఉబికి రావడం చూసాను. ఇది ఇరవయ్యేళ్ళ కిందటి మాట. ఆ పాట నేను వినడమదే మొదటిసారి.

ఆ పాట నీకెందుకు కన్నీళ్ళు తెప్పించిందని అడిగితే...

ఆమె నెమ్మదిగా తన మనసు పుటలు తెరిచింది. కాలేజీలో చదువుకునే రోజుల్లో ఆమె తన సీనియర్‌ని ప్రేమించింది. ఆ పిల్లవాడూ ఈమెని ప్రేమించాడు. ప్రేమ ఇంకా మొగ్గ



మనిషి పట్ల నీ హృదంతరంగంలో చెలరేగే సంచలనాన్ని మానవీయంగా ప్రకటించడమెట్లానో చెప్పేవాళ్ళెవరూ లేరు. అందరికన్నా ముందు ఈ సమస్యను గురజాడే అనుభవించాడు. తెలుగువాళ్ళ మహాకవి. మనల్ని ఆధునిక యుగంలోకి మేల్కొల్పినవాడు. ఆయనన్నాడు కదా -

'ప్రేమ పెన్నిధి గాని
ఇంటను నేర్వరీ కళ
ఒజ్జలెవ్వరు లేరు దీనికి
శాస్త్రము లిందు గూరిచి
తాల్చె మౌనము'

అయినా తనకు తానే తెలుసుకున్నాడట ఆ ప్రేమ విద్యని, ఎట్లా అంటే-
'భాగ్యవశమున,
కవుల కృపగొని' అన్నాడు.

అందుకే అనిపిస్తూంటుంది... బహుశా, తమ ప్రేమావేశానికి మాటలు వెతుక్కోవడమే ఒక జాతి చేసే సాహిత్య ప్రయాణమంతా అని.

తొడుగుతుండగానే ఆ పిల్లవాడి చదువు పూర్తయి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత మళ్ళా ఎప్పుడూ అతను ఆ అమ్మాయిని పలకరించలేదు. కారణం తెలియదు. అతడేమయ్యాడో, ఎక్కడున్నాడో ఆమెకీ తెలీదు. తెలుసుకునే అవకాశం లేదు. చెప్పలేని బాధ, దుఃఖం, "అతణ్ణి తలచుకుంటేనే నా గుండె పిండేసినట్టుంటుంది" అందామె. అంతేకాదు. "ఈ పాట వినగానే నా మాటలే పెట్టి కవి ఆ పాట రాసాడా అనిపించింది" అందామె.

అంటే సిరివెన్నెల సీతారామశాస్త్రిగారు ఒక పదహారేళ్ళ యువతి హృదయంతో రాసారన్న మాట ఆ పాట.

*నడి రేయిలో నీవు నిదరైన రానీవు*
*గడిపేదెలా కాలము గడిపేదెలా కాలమూ*
*పగలైన కాసేపు పని చేసుకోనీవు*
*నీ మీదనే ధ్యానము నీ మీదనే ధ్యానము*
*ఏ వైపు చూస్తున్నా నీ రూపె తోచింది*
*నువ్వు కాక వేరేది కనిపించనంటోంది*
*ఈ ఇంద్రజాలాన్ని నీవే ఇలా చేసింది...* (గులాబీ, 1995)

మనుషులు ప్రేమించుకుంటారు, కవులు ఆ ప్రేమకి మాటలు సమకూరుస్తారు.

## ఇంతకీ ప్రేమ అంటే ఏమిటి?

'సా తస్మిన్ పరమ ప్రేమ స్వరూపా' (ఆయన పరమ ప్రేమ స్వరూపుడు) అంటుంది నారద భక్తిసూత్రం భగవంతుడి గురించి. అంటే శాస్త్రాలకి సహితం భగవంతుణ్ణి నిర్వచించడానికి మరే పదమూ దొరకలేదు... ప్రేమ అనే పదం తప్ప.

ప్రేమలో ఏదో జరుగుతుంది. అదొక కెమిస్ట్రీ. ఆ రసాయనిక చర్య ఏమిటో గుర్తుపట్టడం, తెలుసుకోవడమే పెద్ద అవస్థ.

ఒక పదహారేళ్ళ బాలికకీ, ఒక పద్దెనిమిదేళ్ళ యువకుడికీ మధ్య తొలి చూపులో సంభవించేదాన్ని మాటల్లో పెట్టడం కష్టం. బహుశా గొప్ప ఆధ్యాత్మిక అనుభవంతో మటుకే దాన్ని పోల్చగలం.

తన తొలి రోజుల ఆధ్యాత్మిక అనుభవం గురించి చెప్తూ రమణ మహర్షి 'ఆ అనుభవాన్ని నా శరీరం తట్టుకోలేకపోయింది. అదెట్లా ఉందంటే చిన్న పూరింట్లోకి పెద్ద ఏనుగు ప్రవేశించినట్టుంది' అన్నారు.

ప్రేమలో పడ్డ ప్రతి మనిషీ అనుభవం అదేనేమో! ఆ ఒక్క అనుభవం ముందు మరే అనుభవాలూ సాటిరావనిపిస్తుంది. దేశం కోసం ఉరికంబమెక్కడమో అనవచ్చు. అదీ ప్రేమే కదా!

తన ప్రేమల్ని గుర్తుపట్టడమూ, ప్రేమించినప్పుడు తనలో జరిగేదేదో తనకి తాను వెల్లడి చేసుకోవడమూ - ఇంతకు మించిన గొప్ప విద్య లేదు నా దృష్టిలో. బళ్ళో చాలా చెప్తారు. కళాశాలల్లోనూ, ఇంటర్నెట్‌లోనూ చాలానే పరిజ్ఞానం దొరుకుతుంది. కాని... నీ తోటి

మరొక అడుగు ముందుకు వెళ్ళి నేనో మాట చెప్పాలనుకుంటున్నాను. అసలు ప్రేమకి మాటలివ్వడంలోంచే ఒక జాతి రూపొందుతుందని. ప్రపంచమంతటా మనుషులు ఒక్కలానే ప్రేమిస్తారు, ప్రేమించుకుంటారు. కాని ఆ ప్రేమకి మాటలు వెతుక్కోవడంలోనే ఒక శాఫో గ్రీకు భాషనీ, ఒక గాలిబ్ ఉర్దూ భాషనీ సృష్టిస్తారు. లేదా మరోలా కూడా చెప్పుకోవచ్చు. ఆ జాతులు తమ ప్రేమకి మాటలు వెతుక్కుంటున్నప్పుడే ఒక సంస్కృతం కాళిదాసునీ, ఒక ఇంగ్లీషు ఒక కీట్స్‌నీ వెతుక్కుంటాయని.

## ప్రపంచం కొత్తగా కనిపిస్తుంది...

చాలామంది ఏమనుకుంటారంటే, మనం మాట్లాడుకుంటున్న ప్రేమ ఈ కాలం నాటిదనీ; ప్రాచీన కవులకీ, ప్రాచీన సాహిత్యానికీ ఇట్లాంటి ప్రేమతో పరిచయం లేదనీ. కానీ నిజానికి ప్రేమని వ్యక్తం చేయడానికి తొలి నుంచీ కవుల 'గుండె గొంతుకలో కొట్లాడుతూనే ఉంది.' ప్రేమానుభవాన్ని మాటల్లో పెట్టడానికి తొలి యవ్వనంలో యువతీ యువకులెట్లా మాటల కోసం గుండె పెగుల్చుకోవాలని చూస్తారో ప్రతి కాలంలో ప్రతి కవీ కవయిత్రీ అట్లానే చెప్పలేని వ్యథ అనుభవిస్తూనే వచ్చారు.

మరోలా చెప్పాలంటే - ప్రతి ప్రేమకవితా నిజమైన మనిషిని వెతుక్కునే ఒక ప్రయత్నం.

ఎందుకంటే, ప్రేమించినప్పుడు నీ లోపల్లోపల ఏదో గొప్ప మార్పు సంభవిస్తుంది. అప్పుడు మాత్రమే నువ్వు మనిషిగా పుడుతున్న భావం కలుగుతుంది. నిన్నూ, నీ తోటి మనిషినీ ఒక్కటి చేసే ఆ అపురూపమైన భావన నీకు కొత్త రెక్కల్నిస్తుంది, కొత్త ఇంద్రియాల్ని సమకూరుస్తుంది, ఒక్క





మాటలో చెప్పాలంటే ప్రపంచం నీకు కొత్తగా కనిపించడం మొదలవుతుంది. ప్రతి ఒక్కదాన్నీ, నీ చుట్టూ ఉన్న సమస్తాన్నీ నువ్వు కారణం లేకుండానే ఇష్టపడడం మొదలుపెడతావు. నీకు మామూలుగా తెలిసిన మనుషులే, నీ రోజువారీ దృశ్యాలే, నువ్వు తాకే వస్తువులే హఠాత్తుగా చాలా ఇష్టంగా కనిపించడం మొదలవుతుంది. ప్రాచీన కాలమైనా అదే అనుభవం, ఆధునిక కాలమైనా అదే అనుభవం.

గాథాసప్తశతి ఎప్పటి కావ్యం! ఇప్పటికి సుమారు రెండు వేల ఏళ్ళ కిందట గోదావరి తీరంలోని కొందరు గ్రామీణుల అనుభవాల్నీ, అనుభూతినీ కొందరు కవితలుగా చెప్పుకున్నారు. వాటిని హాలుడనే ఒక శాతవాహన చక్రవర్తి సంకలనం చేసాడు.

అందులో ఒక కవి అంటాడు కదా: తన ప్రియురాలు వదనం చూస్తేనే కాదు, ఆమె ఉంటున్న గ్రామాన్ని చూసినా, ఆ పంటపొలాలు చూసినా కూడా చెప్పలేనంత సంతోషం కలుగుతుందని.

ప్రేమలో ఉండేది ఈ ఇంద్రజాలమే. ప్రేమ పుట్టినప్పుడు ఆ పరిసరాలు, అప్పుడు నువ్వు విన్న పాట, చూసిన సినిమా, చివరికి ఆ రోజుల్లో నువ్వు తోముకున్న సబ్బు కూడా నీకెంతో ప్రీతిపాత్రమనిపిస్తాయి. ఆ ప్రేమ గుర్తొచ్చినప్పుడల్లా ఆనాడు నీ మీంచి వీచిన గాలి కూడా ప్రేమాస్పదంగా తోస్తుంది నీకు.



ఆమె మీద ప్రేమ వల్ల. కానీ ఆమెని వదిలిపెట్టి పోలేడు. అది కూడా ఆమె మీద ప్రేమ వల్లనే. అప్పుడతడు విమోహమనే తాళ్ళు పట్టుకుని ఉయ్యాల ఊగుతున్నట్టుందంటాడు నన్నయ. హృదయంలో ఈ సున్నితత్వం మేల్కోవడమే ప్రేమ. ఒకసారి మేల్కొన్నాక ఆ సున్నితత్వాన్ని కాపాడుకోవడమే ప్రేమ విద్య.

## ప్రణయ గీతాలు

తెలుగులో ఆధునిక యుగం మొదలయినపుడే ఒక స్వేచ్ఛాపిపాస కూడా మొదలయింది. స్వేచ్ఛ అంటే ఏమిటి? తమని తాము వ్యక్తం చేసుకోగలగడం. తమ ఆకాంక్షల్నీ, భావోద్వేగాల్నీ నిస్సంకోచంగా చెప్పుకోగలగడం. ఏదన్నా ఆరోగ్యవంతమైంది కోరుకోగలగడం, కోరుకున్నదాన్ని సాధించుకోవాలనుకోవడం.

ఆధునిక తెలుగు సాహిత్యం మొదలవుతూనే వేంకట పార్వతీశ్వర కవులు ఏకాంతసేవ అనే కావ్యం వెలువరించారు. ఆ కావ్యం ద్వారా తెలుగు సమాజంలో మొదటిసారిగా ఒక individual ప్రభవించాడు. తన వైయక్తిక ఆశల్నీ, ఆనందాల్నీ చెప్పుకోవాలని పరితపించే వ్యక్తి. ఆ వ్యక్తికి ప్రేమించడం ఎంత ముఖ్యమో, ఆ ప్రేమని వ్యక్తం చేయడం కూడా అంతే ముఖ్యం. అలాగని, అంతకు పూర్వకాలంలో ప్రేమ వ్యక్తీకరణలు లేవని కాదు, ప్రేమలేఖలు లేవని కాదు, 'ఏమొకొ చిగురుటధరమున ఎడనెడ కస్తూరినిండెనో/భామిని విభునకు రాసిన పత్రిక కాదు కదా' అని అన్నమయ్య ఏనాడో అన్నాడు కదా! కాని అది మనిషికీ, దేవుడికీ మధ్య నడిచిన ప్రేమలేఖ. వేంకట పార్వతీశ్వర కవులు కోరుకున్నది మనిషికీ, మనిషికీ మధ్య నడిచే ప్రణయగీతం.

## హృదయంలో సున్నితత్వం...

అన్నిటికన్నా ముఖ్యం ప్రేమ చాలా సున్నితం. అది మనలో అతి సున్నితమైన లక్షణాల్ని మేల్కొల్పుతుంది. ఆ అనుభవం మనలో కలిగించే ఆరాటాలు మనకే నమ్మశక్యం కాకుండా ఉంటాయి. గోపికలు కృష్ణుణ్ణి ప్రేమించినప్పుడు ఆ ప్రేమ ఆ నిరక్షరాస్య మహిళల్లో ఎంత సున్నితమైన భావనల్ని మేల్కొల్పిందో సుందరమైన సంస్కృతంలో భాగవతమూ, సున్నితమైన తెలుగులో పోతన్నా చెప్పడానికి ప్రయత్నిస్తారు. గోపికలు అంటున్నారట కృష్ణుడితో 'నువ్వేమో పగలంతా పశువులు కాచుకోవడానికి అడవికి వెళ్ళిపోతావు, అప్పుడెట్లానూ చూడలేము, పోనీ రాత్రివేళైనా నిన్ను కళ్ళారా చూసుకుందామా అంటే, ఇదేమిటి, దేవుడు మా కళ్ళకి రెప్పలడ్డం పెట్టాడు' అని.

నల దమయంతుల ప్రేమకు హంస కదా రాయబారి! అదే ఒకరి గుణగణాల్ని మరొకరి దగ్గర పొగిడి ఒకరినొకరు చూసుకోకముందే ఒకరినొకరు ప్రేమించుకునేలా చేసింది. దమయంతిని మొదటిసారి చూసినపుడు ఆమె హంస చెప్పినదానికన్నా ఎంతో అందంగా ఉందనిపించిందట నలుడికి. కాని అది ఇన్‌ఫాచ్యుయేషన్ మటుకేనని కవికి తెలుసు. దమయంతి ప్రేమలో నలుడు ఎంత నలుగులాట పడ్డాడో ఆ తర్వాత చెప్తాడు కవి. వాళ్ళు సుఖం నుంచి శోకానికి ప్రయాణించినప్పుడు, రాజ్యం పోగొట్టుకుని అడవిపాలయినప్పుడు, దమయంతి నలుణ్ణి వదిలిపెట్టలేక అతడి వెంట అడవుల్లో నడుస్తున్నప్పుడు... ఆ ప్రేమ దుఃఖాన్నంతా కవి వర్ణిస్తాడు. నలుడు ఆమె కష్టం చూసి భరించలేక ఆమెని వదిలిపెట్టి వెళ్ళిపోవాలనుకుంటాడు.



*'విరిదండ మెడలోన వేయుటేగాని*
*కన్నార నీ మూర్తిగాంచనే లేదు*
*నినుగాంచి ముగ్ధనై నిలుచుటేగాని*
*ప్రేమదీరగ బల్కరింపనే లేదు'*

మెడలో విరిదండ వేస్తే సరిపోదు ఈ కొత్త యుగపు మనిషికి. ప్రేమతీరగా పలకరించుకోవాలి, మాట్లాడుకోవాలి.

అలాగని ప్రేమ సుఖవంతమైన భావనేమీ కాదు. అది కలిగినపుడు మనలో ఎవరో కవ్వం పెట్టి చిలికినట్టు ఉంటుంది. అప్పటి మనోభావాల్ని ఇతమిత్థంగా చెప్పడం కష్టం. అందులో అన్నీ ఉంటాయి, విషం లాంటి ద్వేషంతో సహా. ఎవరిపట్లనో అకారణమైన కోపం, చెప్పలేని అసూయ, దిగులు, అశాంతి, ఆందోళన - సంక్లిష్టంగా ఉండే ఈ భావనలకి కవులు అక్షరరూపం ఇచ్చినపుడు ఆ భావావేశ ఛాయలమీద వెలుతురు పడుతుంది. ఆ మేరకు వ్యక్తుల మనస్సూ, సమాజం మనస్సూ కూడా పరిశుభ్రపడతాయి.

'ఆడదానా అద్భుతమైనదానా నిక్వణత్ వీణా
అర్థం లేని నన్ను చుట్టుకున్న పరమార్థానివి నువ్వు'





లాంటి వాక్యాలు తిలక్ లాంటి ఒక కవి రాసిన తరువాత, విచిత్రాకర్షణల చీకటి మీద గుప్పున వెలుగు పడినట్టే. ప్రేమ మాసిపోవచ్చు కూడా. 'ఒకరినొకరు చూసుకోక పోతే ప్రేమ నశిస్తుంది, మరీ (ఎక్కువగా) చూసుకున్నా నశిస్తుంది, ఏమీ చేసుకోక పోయినా నశిస్తుంది' అన్నాడు ఒక ప్రాకృత కవి. ఆ మాటలు గుర్తుండే కాబోలు 'ఎందుకు మాసిపోతుందో ప్రేమ?' అనడుగుతాడు బైరాగి. కాని ప్రేమ మాసిపోతుందనే మెలకువ ప్రేమను మరింత ప్రియాతిప్రియం చేస్తుంది. అందుకని ఆ వెనువెంటనే 'ఇది తలచిన... తల్లి కడుపులో దాగే పిల్లనిలా నా చేతులు నిన్నింకా దగ్గరగా వెదుకుతాయి' అంటాడు.

## ప్రేమ విద్యను నేర్పేవారెవరు?

ఒక రకంగా ప్రేమ మృత్యువు లాంటిదే. కాని అది మనలోని ఒక పరిమిత వ్యక్తిత్వాన్ని పక్కకునెట్టి మనలోని ఒక మహనీయ వ్యక్తిత్వాన్ని ముందుకు తెస్తుంది. ఆ స్థితికి చేరుకున్నప్పుడు కృష్ణశాస్త్రికి మాత్రమే కాదు, మన కోసం కూడా ఒక పల్లకీ తరలివస్తుంది. చలంగారన్నట్టు ప్రేమ మనకి, means for an end కాక, end in itself కావాలి. ఏదో ఒకటి కోరుకోవడం నుంచి ఏదీ కోరుకోవాలనిపించని స్థాయికి చేరుకోవాలి.

*'ఆరిపేయవె దీపమూ*
*యెలుగులో నీ మీద నిలుపలేనే మనసు*
*ఆరిపేయవె దీపమూ*
*సూపులే ఆపేసి రూపు ఊసే మరిచి*
*వొకరెరుగకింకొకరు వొరిగి నిదరోదాము'*

అనగలగాలి, అనుకోగలగాలి.

తెలుగు సాహిత్యంలో ఒక ఆండాళ్, ఒక మీరా, ఒక అక్క మహాదేవి లేరు. కాని,

*'తనువంతటా మనసై మనసంతటా తనువైన*
*నేనైన తనలో పరిపూర్ణమై మేము*
*ఈ కామమోక్ష మోక్షకామ అశాంతుల అగ్నిగోళ*
*మహారణ్యాల కాంక్షా సౌందర్య తాండవ కీలల్లో*
*దగ్ధమై ప్రభవించి ప్రభవించి దగ్ధమై*
*రమిస్తే శమిస్తే దమిస్తే శాంతి శాంతి శాంతి'*

అని ఒక రేవతీదేవి అన్నప్పుడూ,

*'హద్దులలేని భావోద్వేగంలో*
*ఏదో అనుకుంటాను గానీ*
*తీరా కవిత వినా నీవు నీవు కాదని*
*కవిత వినా నాకేం కావని అర్థమవుతుంది'*

అని ఒక శివలెంక రాజేశ్వరి అన్నప్పుడూ,

ప్రేమకీ, కవిత్వానికీ మధ్య హద్దులు చెరిగిన ఒక 'మహల్లాలస' లోంచే వారు మాట్లాడుతున్నారని అర్థమవుతుంది.

ఆలోచిస్తే, ప్రేమించడంలో కన్నా ఆ ప్రేమని ప్రకటించడంలోనే, నిలుపుకోవడంలోనే మన మానవత్వం నిజమైన నిరూపణకి వస్తుందనిపిస్తుంది. ప్రేమని గుర్తుపట్టగలగడం, ఆ సౌకుమార్యం, ఆ నిర్మలత్వం చెదరకుండా కాపాడుకోవడం - ఇప్పుడా విద్య నేర్పేవాళ్ళెవ్వరూ లేరు. ఈనాడు ఎన్నో రకాల టెక్నాలజీల్ని బోధించే సంస్థలున్నాయి. కాని తమ ప్రేమని కాపాడుకునే విద్య మన యువతీ యువకులకి నేర్పేవాళ్ళెక్కడ?

ఒకప్పుడు చలంగారుండేవారు. తాను రాసుకున్న ప్రేమలేఖల్నే పుస్తకంగా వెలువరిస్తూ ఆయనిట్లా రాసారు:

'ప్రేమలో వలెనే లేఖలో కూడా రొమాన్స్, పొయెట్రీ, టెండర్‌నెస్ ఎక్కువగా కనిపిస్తాయి... ప్రియురాలు దగ్గర లేనప్పుడు ఆమెతో ఇంటిమేట్‌గా మాట్లాడడమే ప్రేమలేఖ! ఆంతరంగికుడైన మిత్రుడితో హృదయంలోని మార్దవమైన అభిప్రాయాల్ని చెప్పుకోవడమే ప్రేమలేఖ! మన ఆత్మని వాళ్ళ ఆత్మలతో దూరాన్నీ కాలాన్నీ జయించి ఐక్యం చేసే ప్రయత్నమే, అన్వేషిస్తున్నానని జ్ఞాపకం చెయ్యడమే ప్రేమలేఖ!'

కాని అందుకాయన కొన్ని షరతులు కూడా పెట్టారు :

'నిర్వ్యాజ్యమైన స్నేహం ఉంటేనే గాని స్వచ్ఛమైన హృదయాలు ఉంటేనే గాని మధురమైన లేఖలు పుట్టవు... ప్రేమలేఖలు ఉత్పత్తి కావాలంటే అవి రాసుకునేవాళ్ళకి పరస్పర గౌరవం, తీవ్రమైన ఆకర్షణ, తమ మనోద్రేకాల్ని, ఉన్నత భావాల్ని మాటల్లోకి మార్చగల నేర్పూ, రెండోవారు తమ లేఖని అర్థం చేసుకోగలరనే నమ్మకం ఉండాలి.'

ఇప్పుడు మన పిల్లల ప్రేమకి సినిమా కవులే మాటలిస్తున్నారు. ప్రేమకు సంబంధించిన సకలావస్థల్నీ ప్రకటించుకోవడానికి స్మార్ట్ ఫోన్లలో ముందే రకరకాల ఎమోటికన్లు సిద్ధంగా ఉంటున్నాయి. కానీ, ప్రేమ ఎవరికి వాళ్ళు మాటలు కూర్చుకోవలసిన అభ్యాసం. ఆ ఎక్సర్‌సైజు మరొకళ్ళు చేసేది కాదు. అది ఎవరికివారే చదువుకోవలసిన మెసేజి. దాన్ని షేర్ చెయ్యలేం, ఫార్వర్డ్ చెయ్యలేం. ఒకసారి అది మన సిస్టమ్‌లో ప్రవేశించాక డిలీట్ కూడా చెయ్యలేం.

కానీ, ఇది ఎస్సెమ్మెస్‌ల కాలం. నీ ప్రేమ ప్రకటించినంతసేపు పట్టడం లేదు, తెగిపోవడం; కలుసుకోవాలని కాగినంతసేపు పట్టడం లేదు, కటీఫ్ చెప్పేసుకోవడం.

కాని అది ప్రేమ కాదు. ప్రేమకీ, ఇన్‌ఫాచ్యుయేషన్‌కీ మధ్య తేడా పిల్లలకి తెలిసేదెట్లా? తల్లిదండ్రులు చెప్తే వినరు, గురువులకి చెప్పే తీరిక లేదు, స్నేహితులకి తెలిసిన విషయం కాదు. వాళ్ళ అమాయకమైన హృదయాల్నీ, భావావేశాల్నీ ఒక కమాడిటీగా భావించి తీసే సినిమాలు తప్ప, వాళ్ళకి దారి చూపించే రచయితలేరీ? నిర్మలంగా ప్రేమించడం గొప్ప జీవిత సంస్కారమనీ, మానవీయ ఔన్నత్యమనీ వాళ్లకు చెప్పే రచనలేవీ?

రచయిత మొబైల్ : 94909 57129





# నా ఇష్టం

Raju




ఐ లవ్ యూ!
సారీ...!
ఐ లవ్ యూ!
ఐ టూ లవ్ యూ రా!!


అయ్య బాబోయ్. ఈ రోజు వాలెంటైన్స్ డే. గిఫ్ట్ ఇవ్వక పోతే ప్రాణాలు తోడేస్తుంది నా డార్లింగ్


వొట్టు కాంతం. ఈ అమ్మాయెవరో తెలీదు. పార్కులో కనిపించామని ఆ భజరంగ్ దళ్ వాళ్లు బలవంతంగా పెళ్లి చేశారు !!


ప్రామిస్ డాక్టర్. రాత్రి ఆ మన్మథుడికి బాగా విసుగొచ్చినట్టుంది. ఇక్కడ కొట్టాడు!!


సారీ డార్లింగ్... ఐ మిస్ యు. హ్యాపీ వాలెంటైన్స్ డే !!

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో 'స్పాండిలోసిస్'కు సమర్థవంతమైన పరిష్కారం


డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్




ప్రస్తుత మానవుని జీవన విధానంలో ఎన్నో మార్పులు రావడం వలన ఎక్కువ సమయం కంప్యూటర్ల ముందు కూర్చొని పని చేయడం, ఎక్కువ దూరం వాహనాలపై ప్రయాణించడం వంటి ఎన్నో అంశాల కారణంగా వెన్నెముకపై ఒత్తిడి పెరగటం వలన చాలా రకాల వెన్నెముక సమస్యలు తలెత్తడం జరుగుతుంది. వాటిలో స్పాండిలోసిస్ సమస్యను మనం ఎక్కువ మందిలో గమనించవచ్చు. మానవ శరీరంలో 'వెన్నెముక'ది అత్యంత కీలకమైన పాత్ర. దీని నిర్మాణం ఎంతో సంక్లిష్టమైనది. మెదడు నుండి వచ్చే వెన్నుపాము (Spinal Cord) ను కాపాడుతూ, శరీరంలోని అన్ని కదలికలకూ సహకరిస్తూ, శరీరానికి ఇది మూలస్థంభంగా నిలుస్తుంది.

**స్పాండిలోసిస్ అనగా:** వెన్నెముకలోని డిస్కులు మరియు ఫేసెట్ జాయింట్లలోని మృదులాస్థి క్షీణతకు గురి కావడాన్ని వైద్యపరిభాషలో స్పాండిలోసిస్ అని అంటారు. దీనినే స్పైనల్ ఆర్థరైటిస్ అని కూడా అంటారు. 40 ఏళ్ళు పైబడిన వారిలో ఈ సమస్య ఎక్కువగా కనిపిస్తుంది. కానీ ప్రస్తుత జీవనశైలిలో అనేక మార్పులు చోటు చేసుకోవడం, వాటి ప్రభావం వెన్నెముకపై ఎక్కువగా ఉండటం కారణంగా ఈ సమస్య చిన్న వయస్సు వారిలో కూడా ఎక్కువగా కనిపిస్తోంది.

సాధారణంగా వెన్నెముకలోని రెండు పూసల మధ్య డిస్కులు ఉంటాయి, మరియు వాటి వెనుక భాగంలో ఫేసెట్ అనే జాయింట్లు ఉంటాయి. వీటిలోని మృదులాస్థి, వెన్నెముకకు సంబంధించిన అన్ని కదలికలకు సహకరిస్తూ, ఇవి ఒత్తిడిని తట్టుకునే షాక్ అబ్‌సార్బర్‌లుగా పని చేస్తాయి. వీటి చుట్టూ ఉండే కండరాలు, లిగమెంట్లు మరియు టెండాన్లు జాయింట్లను దృఢంగా ఉంచుతాయి. వెన్నుపూసలలోని నాళాన్ని స్పైనల్ కెనాల్ అంటారు. దీని నుండి వెన్నుపాము ప్రయాణిస్తూ నిర్దిష్ట ప్రాంతాలకు నరాలను పంపుతుంది.



ఏ కారణం చేతనైనా ఈ డిస్కులు లేదా ఫేసెట్ జాయింట్లు క్షీణతకు గురి అయితే వెన్నెముకలో అనేక మార్పులు ఏర్పడటంతో, నొప్పి మరియు కదలికలు కష్టతరంగా మారడం వంటి సమస్యలు తలెత్తుతాయి. వాటి ప్రభావం వలన అక్కడ నుండి వెలువడే నరాలపై ఒత్తిడి పడితే ఆయా అవయవాల పనితీరు దెబ్బతిని తీవ్రమైన నొప్పి సంభవిస్తుంది. సాధారణంగా వెన్నెముకలోని మెడ భాగాన్ని - సర్వైకల్ స్పైన్, వీపు భాగాన్ని - తొరాసిక్ స్పైన్, నడుము భాగాన్ని - లుంబార్ స్పైన్ మరియు క్రింది భాగాలను - సాక్రం, కాకిక్స్ అని అంటారు. క్షీణతకు గురి అయిన ప్రాంతాన్ని బట్టి ఈ సమస్యను సర్వైకల్ స్పాండిలోసిస్, తొరాసిక్ స్పాండిలోసిస్, లుంబార్, సాక్రల్ స్పాండిలోసిస్ అని పిలవటం జరుగుతుంది. వీటిలో సర్వైకల్ స్పాండిలోసిస్ మరియు లుంబార్ స్పాండిలోసిస్ సమస్యలను మనం ఎక్కువగా గమనించవచ్చు.

**కారణాలు:** వయస్సు పైబడటం • వెన్నెముకకు దెబ్బ తగలటం • ఎక్కువగా బరువులు మోయడం • ఒకే పొజీషన్‌లో ఎక్కువ సమయం కూర్చోవడం • ద్విచక్ర వాహనాలపై ఎక్కువగా ప్రయాణించడం • కంప్యూటర్ల పైన రోజంతా పనిచేయడం • ఎత్తయిన దిండ్లు వాడటం మరియు ఫోన్‌లో మాట్లాడేటప్పుడు మెడను సాగదీసి ఒక ప్రక్కకు వంచడం వలన మెడనొప్పి కలుగుతుంది.

**లక్షణాలు:** 'స్పాండిలోసిస్' సంబంధిత లక్షణాలు, శరీరంలో అది ప్రభావితం చేసిన భాగాన్ని బట్టి కనిపిస్తాయి.

**సర్వైకల్ స్పాండిలోసిస్:**
- మెడనొప్పి సాధారణం నుండి తీవ్రస్థాయికి చేరటం.
- నొప్పి - భుజాలతో పాటు చేతులకు మరియు వ్రేళ్ళ వరకు కూడా వ్యాపించడం.
- మెడ బిగుసుకుపోవడం లేదా కదలికలు తగ్గిపోవడం.
- మెడ నరాలపై ఒత్తిడి పడటం వలన చేతులు బలహీనపడటం, పట్టు కోల్పోవడం, తిమ్మిర్లు, మొద్దుబారటం వంటి లక్షణాలను గమనించవచ్చు.
- కొన్ని సార్లు తలనొప్పి, కళ్ళు తిరగడం, వికారం, వాంతులు కావడం వంటి లక్షణాలు గమనించవచ్చు.

**లుంబార్ స్పాండిలోసిస్:**
- నడుము నొప్పి, ఉదయాన్నే నడుము బిగుసుకుపోవడం.
- నొప్పి నడుము నుండి పిరుదులకు మరియు కాళ్ళ వరకు వ్యాపించడం.
- నడుము భాగంలోని నరాలపై ఒత్తిడి పడటం వలన కాళ్ళలో తిమ్మిర్లు, మొద్దుబారటం, నడకలో బ్యాలెన్స్ తప్పడం, మలమూత్రాల విసర్జనపై నియంత్రణ కోల్పోవడం.
- సయాటికా వంటి లక్షణాలను కూడా గమనించవచ్చు.
- వెన్నెముకలోని ఏ భాగంలోనైనా దీర్ఘకాలిక నొప్పి కారణంగా జ్వరం, ఆకలి మందగించడం, బరువు తగ్గడం వంటి లక్షణాలు కనిపిస్తే నిర్లక్ష్యం చేయకూడదు. అవి క్యాన్సర్ లేదా క్షయ లక్షణాలు కావచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** సి.బి.పి., ఎక్స్‌రే, సి.టి. స్కాన్, ఎమ్.ఆర్.ఐ. స్కాన్, హెచ్.ఎల్.ఏ.బి.27 • చేతులు, కాళ్ళ కదలికలను మరియు రిఫ్లెక్సస్‌ను పరీక్షించడం వంటి పరీక్షలు చేయడం ద్వారా వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో అందించబడే అధునాతనమైన జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా రోగి మానసిక మరియు శారీరక లక్షణాలను పరిగణనలోకి తీసుకొని చికిత్స అందించడం ద్వారా వెన్నెముకను దృఢంగా చేసి, తద్వారా స్పాండిలోసిస్ సమస్య తిరగబెట్టకుండా వ్యాధిని సంపూర్ణంగా నయం చేసే అవకాశం ఉంటుంది.

రియల్ క్రైమ్ కహానీ - 38

# పతి... పత్నీ... ఔర్ వో...

**చండీగఢ్‌లోని సెక్టార్ 49లో ఒక ఫ్లాట్...**

**ప్రముఖ మోడల్ పునీత్ సంధును ఆమె ఫ్లాట్‌లోనే ఎవరో పాయింట్ బ్లాంక్ రేంజ్‌లో కాల్చి చంపారు. ఆమె ముఖం, ఛాతి మీద బుల్లెట్ గాయాలున్నాయి.**

**"సార్... నాటు తుపాకీతో దగ్గరి నుంచి కాల్చారు. ఫ్లాట్‌లో ఆమె ఒక్కర్తె ఉంటుంది. బహుశా ఆమెకు బాగా పరిచయం ఉన్నవారి పనే అయ్యుంటుంది. గ్లామర్ ఫీల్డ్‌లో ఉంది కాబట్టి ఏదైనా ప్రేమ వ్యవహారం కూడా అయ్యుండొచ్చు..." చండీగఢ్ దక్షిణ విభాగం ఎఎస్పీ కిషన్... క్రైం బ్రాంచ్ డీఎస్పీ జగ్‌బీర్‌సింగ్‌కు అక్కడి పరిస్థితిని వివరించాడు.**

**"ఓకే. నేను ఆల్రెడీ బయలుదేరాను. ఐ విల్ బి దేర్ వితిన్ ఫైవ్ మినిట్స్..." అంటూ ఫోన్ పెట్టేశారు డీఎస్పీ.**

"ప్రముఖ వ్యాపారి రామ్‌లాల్ కుమారుడు అమిత్‌తో పునీత్ గత ఐదేళ్లుగా సహజీవనం చేస్తున్నట్లు విచారణలో తేలింది..."

బెడ్ మీద పునీత్ మృతదేహాన్ని పరిశీలిస్తున్న డీఎస్పీతో చెప్పాడు ఎఎస్పీ కిషన్.

"ఇంతకీ అమిత్ ఏం చేస్తుంటాడు?"

" అమిత్‌కు ఆల్రెడీ పెళ్లి అయ్యింది సార్... ఇద్దరు పిల్లలు కూడా ఉన్నారు. ఆయన గత కొంతకాలంగా మోడల్ పునీత్‌తో కలిసి ఉండటాన్ని రామ్‌లాల్ కుటుంబం జీర్ణించుకోలేక పోయింది. అతను రేపో మాపో భార్యకు విడాకులిచ్చి పునీత్‌ను రెండో పెళ్లి కూడా చేసుకోవాలనుకుంటున్నాడట..."

" అయితే... రామ్‌లాల్ కుటుంబానికి సంబంధించిన పూర్తి వివరాలు సేకరించండి" అంటూ ముందుకు కదిలాడు డీఎస్పీ.

•••

క్రైం బ్రాంచ్ ఆఫీస్...

పునీత్ హత్య కేసు ఫైల్‌ను పరిశీలిస్తున్నాడు డీఎస్పీ జగ్‌బీర్‌సింగ్.

పునీత్ హత్య రాత్రి ఏడున్నర - ఎనిమిది గంటల మధ్య ప్రాంతంలో జరిగింది.

ఆమె హత్య జరిగిన తర్వాత అక్కడకు మొదటగా వచ్చింది అమిత్.

అతనే పోలీసులకు ఫిర్యాదు చేశాడు.

" కానీ పునీత్ తల్లి అమిత్‌పైనే అనుమానం వ్యక్తం చేస్తూ ఫిర్యాదు చేసింది. సో... అనుమానితుల లిస్టులో అమిత్‌ను ముందు చేర్చండి. ఆ తర్వాత అమిత్ తండ్రి రామ్‌లాల్ కూడా అనుమానితుడిగానే కనిపిస్తున్నాడు..."

"అవున్సార్... అమిత్, రామ్‌లాల్‌లను విచారిస్తే విషయం బయటపడుతుంది" అన్నాడు ఎఎస్పీ కిషన్.

" ఓకే... పునీత్, అమిత్‌ల సెల్‌ఫోన్ కాల్ డిటెయిల్స్ కూడా తెప్పించండి"

ఎస్సైని పురమాయించిన కొద్ది గంటల్లోనే కాల్ డీటెయిల్స్‌తో పాటు అనుమానితులు ఇద్దరు కూడా డీఎస్పీ ముందు హాజరయ్యారు.

రామ్‌లాల్, అమిత్‌లను ఒకేచోట కూర్చోబెట్టి వారి మీద ప్రశ్నల వర్షం కురిపించాడు డీఎస్పీ సింగ్.

"సార్... మా అబ్బాయితో మోడల్ పునీత్ కలిసి ఉండటం వల్ల మాకెవరికీ ఇష్టం లేదు. భార్య ఉండగానే నా కొడుకు దాని మోజులో పడ్డాడేమిటా అనే కోపం, బాధ నాకుండేది. ఆ కారణంగానే సమాజంలో తలెత్తుకుని తిరగలేకపోతున్నాం. మా వాడిని వదిలేసి వెళ్లిపోతే ఎంత డబ్బు కావాలంటే అంత డబ్బు ఇస్తానని ఆమెకు ఓపెన్ ఆఫర్ కూడా ఇచ్చాను..."

"దానికి ఆమె ఏమంది?"

" ఆమె తిరస్కరించింది. నా కొడుకు నుంచి ఆమెను ఎలా దూరం చేయాలా అనే ఆలోచనలో నేను సతమతమవుతున్న మాట వాస్తవమే కానీ ఆమె హత్యతో నాకెలాంటి సంబంధం లేదు" అని రామ్‌లాల్ భోరుమన్నాడు.

ఆయనను అక్కడినుంచి పంపించిన తర్వాత డీఎస్పీ చూపు అమిత్ వైపు తిరిగింది.

"సార్... నేను పునీత్‌ను ప్రాణంగా చూసుకున్నా. ఆమె అంటే నాకు చాలా ఇష్టం. ఆమెను నా నుంచి విడదీయాలని మా కుటుంబ సభ్యులు ప్రయత్నించిన మాట వాస్తవమే. కానీ దానికి నేను అంగీకరించలేదు. పునీత్‌ను పెళ్లి చేసుకుందామనుకున్నా. నా భార్యకు కూడా ఈ విషయం తెలుసు. అందుకే ఆమె విడాకులు ఇవ్వడానికి కూడా ఒప్పుకుంది. అలాంటి పరిస్థితుల్లో నేనెందుకు పునీత్‌ను చంపుతాను" అంటూ అమిత్ ఏడవటం మొదలెట్టాడు.

" పునీత్ చనిపోయాక నువ్వే కదా పోలీసులకు కంప్లైంట్ చేసింది. మీరిద్దరూ కలిసి ఉండేది వేరే ఇంట్లో. హత్య జరిగింది వేరే చోట. ఆ ఫ్లాట్ పునీత్‌ది. అంటే మీరిద్దరు ఆ రెండిళ్లలోనూ ఉంటుంటారా?" అని డీఎస్పీ ప్రశ్నించారు.

" మేము సరదాగా ఉండాలనుకుని ఆ ఇల్లు తీసుకున్నాం. నేను లేనప్పుడు పునీత్ తన ఫ్లాట్‌కు వెళ్లిపోతుంది. ఆ రోజు మేమిద్దరం కలిసుండే ఇంటికి వెళ్లి అక్కడి నుంచే పునీత్‌కు ఫోన్ చేశాను. ఆమె కాల్ లిఫ్ట్ చేయలేదు. దాంతో నా కారులో సెక్టార్ 49 ఫ్లాట్‌కు వెళ్లాను..."

అమిత్ మాటలు వింటూనే అతని సెల్‌ఫోన్ కాల్ డిటెయిల్స్ చూస్తున్న డీఎస్పీ సింగ్ చూపు ఆ లిస్టులో ఒక చోట ఆగిపోయింది.

" నువ్వు నిజమే చెప్తున్నావా?" గద్దించాడు డీఎస్పీ.

" అవున్సార్... నేను నిజమే చెప్తున్నా. నేను ఏమీ దాయడంలేదు..." అన్నాడు. కాసేపటికి అమిత్‌ని వెళ్లమని సైగ

చేశాడు డీఎస్పీ సింగ్.

కాని అమిత్ చెప్పిన వివరాలకు కాల్ డిటెయిల్స్ మ్యాచ్ కాకపోవడం ఆయన్ని ఆలోచనలో పడేసింది.

అమిత్ ముందుగా తామిద్దరు ఉండే ఇంటికి వెళ్లి అక్కణ్నుంచి పునీత్‌కు కాల్ చేసినట్లు చెప్పాడు. కానీ అతడు చేసిన ఫోన్‌కాల్ టవర్ లోకేషన్ అతడి ఆఫీస్ అడ్రస్‌ను చూపిస్తున్నది. అతను ఆఫీస్ నుంచి బయల్దేరి నేరుగా పునీత్ ఫ్లాట్‌కే వచ్చినట్లు టవర్ లోకేషన్స్ స్పష్టం చేస్తున్నాయి. అయితే అమిత్ రాకకు ముందే హత్య జరిగినట్లు ఫోరెన్సిక్ నివేదిక స్పష్టం చేస్తోంది. అలాంటప్పుడు మరి అమిత్ ఎందుకు అబద్ధం చెప్తున్నాడు? ఇందులో ఏదైనా మతలబు ఉందా?

అమిత్‌పై అనుమానాలున్నప్పటికీ ఈ హత్య అతడు చేయలేదనేది స్పష్టమవుతోంది. ఎందుకైనా మంచిదని మరోసారి అమిత్ కాల్ డిటెయిల్స్‌ను విశ్లేషించడం ప్రారంభించాడు డీఎస్పీ.

హత్య జరిగిన రోజు అమిత్‌కు ఎవరెవరు ఫోన్ చేశారు? అతను ఎవరెవరితో మాట్లాడాడు? అమిత్‌కు కాల్ చేసినవాళ్లు ఆ తర్వాత ఎవరెవరితో మాట్లాడారు? వగైరా వివరాలు తెలుసుకోవడం కోసం సరిగ్గా హత్య జరిగిన సమయానికి కాస్త అటుఇటుగా అమిత్ ఫోన్‌కు వచ్చిన కాల్ నెంబర్స్ అన్నిటినీ మార్క్ చేశాడు డీఎస్పీ.

ఆ నెంబర్లకు సంబంధించిన కాల్ డిటెయిల్స్ తెప్పించుకుని పరిశీలిస్తున్న డీఎస్పీకి రెండు టెలిఫోన్ నెంబర్స్ అనుమానాస్పదంగా కనిపించాయి. ఆ నెంబర్లు ఎవరివని ఆరా తీస్తే వాటిలో ఒకటి అమిత్ చెల్లెలు అంజు చౌదరిదని, మరో నెంబర్ ఆమె స్నేహితుడు సంప్రీత్‌దని తేలింది.

అంటే సీన్లోకి మరో ఇద్దరు వచ్చారన్నమాట.

పునీత్ హత్య జరిగిన రోజు వాళ్లిద్దరు చాలాసేపు మాట్లాడుకోవడం... పలుమార్లు ఒకరికొకరు కాల్స్ చేసుకోవడం... పునీత్ హత్య సమయంలో సంప్రీత్ సెల్‌టవర్ లోకేషన్ సెక్టార్ 49నే చూపిస్తుండటంతో విచారణ కొత్త మలుపు తిరిగింది.

ఆ సమయంలో సంప్రీత్ అక్కడ ఎందుకున్నాడు?

"ఈ విషయం తెలుసుకుంటే కేసు చిక్కుముడి వీడొచ్చు. వెంటనే సంప్రీత్‌ను పిలిపించండి" అని ఒక ఎస్సైని ఆదేశించాడు డీఎస్పీ.

మరి కొన్ని గంటల్లో సంప్రీత్ పోలీసులకు చిక్కాడు.

పోలీసులు తమదైన రీతిలో ఇంటరాగేషన్ చేసేసరికి కేసు మిస్టరీ వీడింది.

•••

ఆ మర్నాడు చండీగఢ్ కమిషనర్ సుఖ్‌పాల్‌సింగ్ విలేకరుల సమావేశం ఏర్పాటు చేశారు.

సెలబ్రిటీ హత్యకు సంబంధించిన విషయం కాబట్టి గది విలేఖరులతో కిక్కిరిసిపోయి ఉంది.

"ప్రేమ, పగలకు సంబంధించిన విషయమిది. అమిత్ తనవరకు తాను మోడల్ పునీత్‌తో సహజీవనం చేస్తున్నానని అనుకున్నాడు కానీ ఆ సంబంధాన్ని అతడి కుటుంబం అక్రమసంబంధంగానే భావించింది. తమ కుటుంబ పరువును అమిత్ మంటగలుపుతున్నాడని అనుకున్నారు వాళ్లు. ఇంతకీ పునీత్‌ను హత్య చేయించింది ఎవరో తెలుసా? అమిత్ సోదరి అంజు..."

ఆ మాట వినగానే అక్కడున్నవారంతా ఒక్కసారిగా ఆశ్చర్యపోయారు.

"అమిత్ సోదరి అంజు, తన స్నేహితుడైన సంప్రీత్‌తో పునీత్‌ను హత్య చేయించింది. ఈ హత్య చేసేందుకు ఆరు లక్షల రూపాయలకు బేరం కుదిరింది. సంప్రీత్ ముందుగా లక్ష రూపాయలు అడ్వాన్స్ తీసుకున్నాడు. ఒక నాటు తుపాకీ, తూటాలు కొన్నాడు. అంజు ఫ్రెండ్‌గా తెలుసు కాబట్టి ఆ రోజు తన ఇంటికి వచ్చిన సంప్రీత్‌ను చూసి పునీత్ ఏమాత్రం అనుమానించలేదు. ఆమెతో మాట్లాడుతూనే పిస్టల్ తీసి నేరుగా ముఖం, ఛాతిపై కాల్పులు జరిపాడు సంప్రీత్. ఆ తర్వాత పని అయిపోయిందంటూ అక్కడి నుంచే అంజుకు ఫోన్ చేసి చెప్పాడు. పనిలో పనిగా అమిత్‌కు కూడా ఫోన్ చేసి 'అంజు డిన్నర్ ఇస్తోంది వస్తావా?' అని అడిగాడు. 'ఇంతకీ



నువ్వెక్కడున్నావ్' అని అమిత్ ప్రశ్నిస్తే తాను అంజు దగ్గర ఉన్నానని అబద్ధం చెప్పాడు. ఆ తర్వాత సంప్రీత్ అక్కడి నుంచి వెళ్లిపోయాడు..."

"హత్య తాను చేయనప్పుడు అమిత్‌కు సంప్రీత్ మీదగానీ అతడి చెల్లెలి మీదగానీ అనుమానం రాలేదా?" ఒక విలేఖరి ప్రశ్నించాడు.

"వచ్చింది. సంప్రీత్ మీద, తన చెల్లెలి మీద అనుమానం ఉన్నప్పటికీ అమిత్ ఎందుకో ఆ విషయాన్ని దాచాడు. మాకు కూడా చెప్పలేదు. బహుశా కుటుంబం పరువు పోతుందని భయపడి ఉంటాడు. నిజానికి అంజుకు తన వదిన అంటే చాలా ఇష్టం. ఒక మోడల్ వ్యామోహంలో పడి అన్న దేవతలాంటి తన వదినకు అన్యాయం చేస్తున్నాడని అంజు అభిప్రాయం. ఆ విషయమై అన్నతో చాలాసార్లు గొడవ పడింది కూడా. పునీత్ వల్లే అన్నావదినల కాపురంలో చిచ్చురేగిందని, వదినకు అన్యాయం జరగడమేగాక తమ కుటుంబం పరువు పోయిందని కక్ష పెంచుకుంది. తన స్నేహితుడైన సంప్రీత్ ద్వారా పునీత్‌ను అడ్డు తొలగించాలనుకుంది. అతడితో బేరం కుదుర్చుకుని ఎట్టకేలకు మట్టుబెట్టగలిగింది. కానీ పోలీస్ విచారణలో దొరికిపోతానని అంజు ఊహించలేదు. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులోకి వచ్చిన తర్వాత నేరస్తుడు ఎంత తెలివిగా వ్యవహరించినా ఎక్కడో చోట దొరికిపోక తప్పదు" అంటూ విలేకరుల సమావేశాన్ని ముగించారు కమిషనర్ సుఖ్‌పాల్‌సింగ్.

**- వేముల సత్యనారాయణ, 99854 88800**







తెలుగు కాలనీ

# రగులుతున్న తెలుగుదనం

**తెలుగు జాడలు - 3**

**మలేసియా అనగానే ఆకాశాన్ని తాకే గోపురాల్లాంటి పెట్రొనాస్ జంట భవనాలు గుర్తుకొస్తాయి. సౌందర్యానికీ, సౌకర్యవంతమైన జీవనానికీ నమూనా నగరాలున్న దేశంగా మన నేతలు పదే పదే ప్రస్తావించే మలేసియా అభివృద్ధిలో తెలుగువాళ్ళ పాత్ర తరాల కిందటి నుంచే ఉంది. మూడు కోట్ల మలేసియా జనాభాలో అయిదు లక్షల మందికి పైగా తెలుగు వాళ్ళు ఉన్నారు. సెనేటర్లుగా, సివిల్ సర్వెంట్లుగా, డాక్టర్లుగా, లాయర్లుగా, ఇంజనీర్లుగా, వ్యాపారవేత్తలుగా ... తెలుగు సంతతివారు బాగానే కుదురుకున్నారు. అయిదు వందల మందికి పైగా తెలుగు మిలియనీర్లున్న మలేసియాలో సొంత కారు లేని తెలుగు కుటుంబం దాదాపుగా లేదు. దేశ రాజధాని కౌలాలంపూర్, పరిపాలనా రాజధాని పుత్రజయతో సహా దేశం నలుమూలలా తెలుగుజనం విస్తరించి ఉన్నారు. అయితే, వీరంతా ఆధునిక కాలపు ఐటీ ఉపాధి వలసదారులు కారు. కూలీలుగా కటుంబాలకు కుటుంబాలు కడుపు చేతబట్టుకుని పడవలు ఎక్కి సముద్రాలు దాటి వచ్చిన బడుగుజనం. గాయంలా గతాన్ని మోసుకుంటూ, వర్తమానంలో తెలుగును బతికించుకుంటూ, తెలుగు భవిష్యత్తు పట్ల కలవరపడుతున్న అయిదోతరం, ఆరోతరం ఇప్పుడు మలేసియాలో ఉన్నారు.**

"తమిళనాడులో తెలుగు బడులన్నీ మూసేసినారంట కదా. ఏం ... మీరు ఫైట్ చెయ్యరు? తమిళ బడులు మీరూ మూసీయొచ్చు గదా" అని అడిగారు ఇడ్లీలోకి చట్నీ వడ్డిస్తూ దేవి. సుంగైసుమన్‌లో మింది సుబ్రహ్మణ్యం అనే ప్లాంటేషన్ ఉద్యోగి భార్య ఆమె. తెలుగువాళ్ళని కలుసుకోవడానికే మలేసియా వచ్చామని తెలిసి తమ ఇంట్లో ఆతిథ్యం ఇచ్చారు. అడపాల సుబ్బారెడ్డి ఇంటర్‌నెట్‌లో వెతికి పట్టుకున్న ఒకానొక తెలుగు అడ్రస్ అది. ఆప్యాయంగా పలకరింపులు మొదలయ్యాయి. అక్కడ నుంచి బాగన్‌దత్తో లో తెలుగు తరగతులు జరుగుతున్న వెంకటేశ్వరస్వామి ఆలయానికి చేరుకున్నాం. సంఖ్య ఘనంగానే ఉన్నా, మలేసియాలో తెలుగు బడులు లేవు. మలయ్‌లోనో, తమిళ బడుల్లోనో చదువుకోవాల్సిందే. తెలుగు రాయడం, చదవడం నేర్పించడానికి మలేసియా తెలుగు సంఘం ఇటువంటి ప్రత్యేక శిక్షణా తరగతులు నిర్వహిస్తోంది. అక్కడ పాఠాలు చెపుతున్న డి.వి.శ్రీరాములు భారత దేశం నుంచి వచ్చిన తెలుగువాళ్ళం అని చెప్పగానే మాటల జలపాతంలా మారారు. "ధనుర్మాసం రాగానే తిరుపతి గుడిలో సుప్రభాతం చదివేది ఆపేసి తిరుప్పావై మొదలు పెడతారు. మీ


95 ఏళ్ల కళా రాములమ్మ

టీవీలు, పేపర్లు అన్నీ తమిళ తిరుప్పావైతో హోరెత్తి పోతాయి. 32 వేల కీర్తనలు రాసిన అన్నమయ్య పదాలకన్నా గొప్పవా అవి? సుప్రభాతాన్ని కూడా తమిళంలోకి అనువదించుకుని చదువుతారు వాళ్ళు. తెలుగువాళ్ళకి స్వాభిమానం ఎందుకుండదు?" అని అడిగారాయన. ఆయన అసహనం వెనుక చాలా కారణాలే ఉన్నాయి. భాష, ఆచార వ్యవహారాల పట్ల విపరీతమైన అభిమానం ప్రదర్శించే తమిళుల వల్ల మలేసియాలో తెలుగు ఉనికికి ముప్పు ఏర్పడింది. "సుఖదుఃఖాలు అనే తెలుగు సినిమా తెచ్చుకుంటే, ఆడనీలేదండీ వాళ్లు. గొడవ చేసి ఆపేయించారు" అని మాకు ఆతిథ్యం ఇచ్చిన సుబ్రమణ్యం చెప్పారు. "వెంకటేశ్వరస్వామి గుడికి వాళ్ళు రారు. ఆయన తెలుగువాళ్ళ దేవుడంట. వాళ్లు సుబ్రమణ్యస్వామి గుడులకీ, శక్తి గుడులకీ వెళ్తారు" అని వివక్ష తీవ్రతను వివరించాడు ఒక పూజారి. "మలేసియాలో ఉండే అరవవాళ్ళంతా నిజంగా అరవ వాళ్ళు కాదు. సగం మంది తెలుగోళ్ళే. అప్పటి మద్రాసు రాష్ట్రం నుంచి వచ్చినోళ్లు. కాని తమిళనాడు విడిపొయ్యాక వాళ్ళకి ఆంధ్రతో ఏం పని? తమిళులుగా మారిపొయ్యారు.. మొదట్లో తమిళుల వెనుకే అందరం వెళ్ళేవాళ్ళం. తేడా చూపిస్తున్నారని తెలిశాక తెలుగోళ్ళం ఒక్కటిగా ఉన్నాం" అని మదిని సోమినాయుడు చెప్పారు. 88 ఏళ్ళ ఈ పెద్దాయన మలేసియాలో తెలుగు బోధన కోసం నిరంతరం శ్రమిస్తున్నారు.

## ఏల వివక్ష?

రాజకీయాల్లో కూడా క్రియాశీలంగా ఉండే తమిళుల వల్ల మలేసియాలో భారతీయులు అంటే తమిళులు అనే అభిప్రాయం స్థిరపడిపోయింది. 500 తమిళ బడులున్న మలేసియాలో తెలుగు బడి ఒక్కటీ లేదు. ఒకప్పుడు ఉండేవి. కాని ఇప్పుడు మూతబడ్డాయి. తమిళ దినపత్రికలున్నాయి. తమిళ టీవీ ఛానెల్స్ నడుస్తున్నాయి. తమిళ సినిమాలు రిలీజ్ అవుతాయి. ప్రభుత్వంలో తమిళ మంత్రులున్నారు. తెలుగువాళ్ళకి మాత్రం పత్రిక లేదు. టీవీల్లో తెలుగు కార్యక్రమాలకి తావు లేదు. ఒక నిశ్శబ్ద కుట్ర జరుగుతోందనే అసహనం తెలుగువాళ్ళలో ఉంది. మలేసియాలో ఉన్న తమిళుల కార్యక్రమాలకి తమిళనాడు నుంచి తరచూ రాజకీయ నాయకులు వస్తుంటారు. సినిమా వాళ్లూ వస్తుంటారు. మీ వెంట మేం ఉన్నాం అని చెబుతుంటారు. "మనోళ్ళూ ఉన్నారండి .. అమెరికాకి అయితే పిలిసీ పిలవంగానే ముప్పయి మందీ నలపై మందీ సినిమావోళ్లూ, లీడర్లూ పరిగెట్టుకెలిపోతారు. మాం పిలిస్తే మాత్రం పలకనే పలకరు" అని సింహాచలం అనే టీచర్ ఆవేదనగా చెప్పారు.



'కౌల కబు బారు' శిబిరంలో తెలుగు పాఠాలు

## టాం జోరు

అరవై ఏళ్ళ కిందట మొదలైన మలేసియా తెలుగు సంఘం (టామ్) కార్యక్రమాలు ఏడెనిమిదేళ్ళుగా ఊపందుకున్నాయి. డాక్టర్ అచ్చయ్య కుమార్ అధ్యక్షుడిగా, అప్పలనాయుడు కార్యదర్శిగా బాధ్యతలు స్వీకరించాక తెలుగు చదువుల మీద దృష్టి పెట్టారు. దేశంలో 30 శాఖలున్న మలేసియా తెలుగు సంఘం తెలుగు అక్షరంతోపాటు ఆచార సంప్రదాయాలు నేర్పడానికి నీతి శిబిరాలు కూడా నిర్వహిస్తోంది. కౌల కబు బారు అనే ప్రాంతంలో 270 మంది పిల్లలతో నిర్వహిస్తున్న అలాంటి ఒక శిబిరంలో రెండు రోజులు గడిపాం. ఆ శిబిరంలో మూడు వారాలు పాఠాలు చెప్పడం కోసం తెలుగు రాష్ట్రాల నుంచి  పది మంది టీచర్లు వచ్చారు. రిటైరైనా విశ్రాంతి కోరుకోకుండా పిల్లల కోడిలా శిబిరంలో తిరుగుతున్న ప్రిన్సిపాల్ అప్పలనాయుడు అక్కయ్యని పలకరించాం. "మాం ఈ తావునే పుట్టాం. ఇక్కడ్నే సదూకున్నాం. ఇక్కడ్నే పెరిగాం. అయినా ఇక్కడ ఉండే మేం మా మాతృదేశం అని సంతోసపడతాం. అక్కడి మాట పలుకు వింటే సంబరపడతాం. మరి మీరేటి సేత్తన్నారు ... ఒక తల్లి పిల్లలకి ఏం చేయాలో అది చేయడం లేదండీ .. మనకింకా పిల్లలున్నారు, ఆలు కడుపు సేతట్టుకుని దూరంగా ఎలిపోనారు. ఆలూ మన పిల్లలే అని తల్లి గుర్తెట్టుకోలేదండీ .. బాదగుంటాదండీ అనుకుంటే" కన్నీళ్ళు పొంగుతున్న గొంతుతో ఆయన అన్న మాటలు ఇవి. పక్కనే ఉన్న హోసూరులో, బళ్ళారిలో అరవై ఏళ్ళుగా రెప్పలు దాటి  రగులుతున్న ఉప్పెనలే కనిపించని వాళ్ళకి, చైనా సముద్ర తీరంలో పొంగే కన్నీటి హోరు వినిపిస్తుందా?



నాణాలు చూపిస్తున్న సింహాచలం

( అయిపోయింది )

- ఆర్ ఎం ఉమామహేశ్వరరావు

99854 25888

### తెలుగు జనం మరణ ఘోష
## 'బ్రిడ్జ్ ఆన్ ది రివర్ క్వాయ్'

1942లో మలయాను జపాన్ ఆక్రమించుకుంది. ఈ యుద్ధకాలంలో థాయ్‌లాండ్ నుంచి బర్మాకి అడవులు నరికి కొండ కోనల మీదుగా రైల్వే లైను నిర్మాణం చేపట్టారు. తెలుగు, తమిళ కూలీలను బలవంతంగా ఇక్కడికి తరలించారు. దోమలు, జంతువులు, ఆకలి, యుద్ధం ... వీటి బారిన పడి లక్ష మంది తెలుగు, తమిళ కూలీలు చనిపోయారు. దీని మీద 'బ్రిడ్జ్ ఆన్ ది రివర్ క్వాయ్' అనే పేరుతో ఇంగ్లీషు సినిమా కూడా వచ్చింది. తెలుగువాళ్ళని ఇప్పటికీ వెంటాడుతున్న గాయం ఇది. "జాతోడికీ జపానోడికీ దెబ్బలాటలొచ్చీసినాయి. పైనించి బాంబులేసీసినారు. పారిపొండి అలాగ అడివిలోకి అని అరిసీసినారు. మా వేటి సేత్తాం .. పరిగెత్తీసినాం. మా నాయన సచ్చిపోనాడు. నా కాలికి ఇలాగ దెబ్బ తగిలీసింది" అంటూ గాయపు మచ్చను చూపించాడు ఆల అప్పారావు. ఆయన వయస్సు 83 ఏళ్ళు. విశాఖ దగ్గరి పెందుర్తి నుంచీ మలేసియాకు వచ్చిన కుటుంబం వాళ్ళది. ఆయన ఇప్పుడు తెలోక్‌బారులో ఉంటున్నారు.






## రంగులు వేయండి



## కొమ్ముల సాలీడు

వైపై గాడ్జెట్‌లా ఏంటెన్నాలతో కనిపిస్తున్న ఈ పురుగు ఒక సాలీడు అంటే నమ్మడం కష్టం. మనం చూసే సాలీడుతో ఏ మాత్రం పోలిక లేని ఈ సాలీడు 'ఓర్బ్ వీవర్ స్పైడర్' జాతికి చెందింది. అడవుల్లో ఎక్కువగా నివసించే ఈ సాలీడు మన దేశంతో పాటు బోర్నియో, చైనాలలో కూడా కనిపిస్తుంది. తన కొమ్ములతో శత్రువులను భయపెట్టి... వాటికి దొరకకుండా తప్పించుకుంటుంది.



## నా బొమ్మ



**సి.నందిత**
7వ తరగతి,
ఎన్.ఎస్.ఎమ్
పబ్లిక్ స్కూల్
విజయవాడ



## మీకు తెలుసా!



1స్ట్రాబెర్రీలు ఎరుపులోనే కాదు తెలుపు, పసుపు రంగుల్లో కూడా ఉంటాయి.

1ఆవులకు స్నేహగుణం బాగా ఉంది. ఏ కారణం చేతనైనా వాటి స్నేహితుల్ని మందలోంచి వేరు చేస్తే అవి ఒత్తిడికి గురవుతాయి.

1 జపాన్‌లో పండే చతురస్రాకార పుచ్చకాయలు అలంకరణ నిమిత్తమే... తినేందుకు పనికిరావు.

## ఐస్‌క్రీమ్ తాత

గిన్నిస్ బుక్‌లోకి ఎక్కడానికి చాలామంది ఎన్నో ప్రయత్నాలు చేస్తుంటారు. కానీ ఏ ప్రయత్నం లేకుండా కేవలం తాను చేసే పని వల్లనే గిన్నిస్ రికార్డు సాధించారు అలాన్ గాంజ్. 1947లో తన తండ్రికి సాయంగా పదేళ్ల వయసులో ఐస్‌క్రీమ్ అమ్మడం మొదలుపెట్టిన అలాన్ 2015 దాకా ఐస్‌క్రీమ్ అమ్ముతూనే ఉన్నాడు. దానివల్లనే 'ప్రపంచంలో ఎక్కువ కాలం ఒకే వృత్తిలో కొనసాగిన వ్యక్తి'గా గిన్నిస్ రికార్డులకెక్కాడు. ఇంగ్లండులోని మసాచుసెట్స్‌లో నివసించే అలాన్‌కి ఫేస్‌బుక్‌లో ఓ ఫ్యాన్ పేజీ కూడా ఉంది.



**టిప్**

మీ చదువుకు సంబంధించిన అంశాల కోసం google.com లో వెతికే బదులు scholar.google.com లో వెతకండి. కావాల్సిన సమాచారం లభ్యమవుతుంది. హ్యావ్ ఎ నైస్ డే!




## చుక్కలు కలపండి



## తేలియాడే అడవి

నూట అయిదేళ్ల సుదీర్ఘ చరిత్ర ఉన్న ఓడ ఎస్ ఎస్ ఆయిర్‌ఫీల్డ్ (Ayirfield). రెండో ప్రపంచ యుద్ధంలో రవాణా నౌకగా సేవలందించిన నౌక అది. 1972లో దానిని భాగాలుగా విడగొట్టి అమ్మేయాలనుకున్నారు. అయితే తర్వాత ఎందుకో ఆలోచన మార్చుకుని దానినలాగే వదిలేశారు. నెమ్మదిగా ఆ నౌకలో మొక్కలు పెరగసాగాయి. ఆ తర్వాత అవి వట వృక్షాలైపోయాయి. ఇప్పుడది తేలియాడే అడవిలా మారిపోయి సిడ్నీ నగరం పక్కన ప్రవహించే హోమ్‌బుష్ బేలో సందర్శకులకు కనువిందు చేస్తోంది. ఫోటోగ్రాఫర్లు తమ కెమెరాల్లో, చిత్రకారులు తమ కాన్వాసుల్లో దానిని బంధించడానికి పోటీ పడుతుంటారు.



## దారి కనుక్కోండి




## బేతాళ ప్రశ్న-21

ఒక బుట్టలో నాలుగు యాపిల్ పండ్లు ఉన్నాయి. ఒక టీచర్ వాటిని నలుగురు స్టూడెంట్స్‌కు సమానంగా పంచి, ఒక యాపిల్‌ను ఫ్రిజ్‌లో పెట్టింది. ఆ యాపిల్ పండు ఎలా మిగిలింది?

**సమాధానం వచ్చేవారం**

**మీ దగ్గర ఇలాంటి మెదడుకు మేతవేసే ప్రశ్నలు, భేతాళ ప్రశ్నలు ఉంటే జవాబుతో పాటు మా ఈమెయిల్ kerintha.aj@gmail.com కు పంపించగలరు**

**గతవారం సమాధానం:** ప్రదీప్ వంద రూపాయలకు రెండు విధాలుగా చిల్లర తేవొచ్చు. ఒక 50 రూ. నోటు, ఒక 20 రూ. నోటు, ఐదు 5 రూపాయల నోట్లు, రెండు 2 రూపాయల నోట్లు, ఒక రూపాయి నోటు కలిస్తే మొత్తం 100 రూ. అవుతుంది. అలాగే నాలుగు 20 రూ. నోట్లు, మూడు 5 రూ. నోట్లు, రెండు 2 రూ. నోట్లు, ఒక 1 రూ. నోటు కలిసినా 100 రూ. అవుతుంది.



**బేతాళ ప్రశ్న-19కి సరైన సమాధానం పంపిన మొదటి ముగ్గురు:** కె.వి. మణికంఠ, ఈమెయిల్, సయ్యద్ అక్తర్, నెల్లూరు, ఎ. హృషికేష్, కడప

# వీపును కాన్వాస్‌గా అమ్ముకున్నాడు..

చాలా పెయింటింగులు చూసి ఉంటారు కాని వీపు మీద బొమ్మను ప్రదర్శించే బాడీ కాన్వాస్‌ను (బాడీ ఆర్ట్ కాదు) ఎప్పుడైనా చూశారా? టిమ్ స్టీనర్ అనే వ్యక్తి తన వీపును కాన్వాసుగా అమ్ముకుంటే, ప్రసిద్ధ బెల్జియన్ ఆర్టిస్టు విమ్ డెల్‌వోయే 40 గంటలపాటు శ్రమించి దాని మీద ఒక పెయింటింగ్‌ను టాటూలా వేశాడు. దాన్ని జర్మన్ ఆర్ట్ క్యూరేటర్ రింకింగ్ కోటి రూపాయలకు పైగా వెచ్చించి కొనుగోలు చేశాడు (అందులో సుమారు 35 లక్షల రూపాయలు స్టీనర్‌కు దక్కాయి). ఎక్కడ ఆర్ట్ ఎగ్జిబిషన్ జరిగినా అక్కడికెళ్లి స్టీనర్ తన వీపును ప్రదర్శిస్తుంటాడు. ఈ పదేళ్లలో ఆయన ప్రపంచవ్యాప్తంగా జరిగిన అనేక ఎగ్జిబిషన్‌లలో పాల్గొని తన వీపు చిత్రాన్ని ప్రదర్శించాడు. “ నా చర్మంపై క్యూరేటర్ రింకింగ్‌కే పూర్తి హక్కు ఉంటుంది కాబట్టి నేను చనిపోయిన తర్వాత నా వీపు చర్మాన్ని ఒలిచి ఆ పెయింటింగ్‌ను ఫ్రేమ్ కట్టించుకోమని కూడా చెప్పాను” అని తెలిపాడు స్టీనర్.





అవీ ఇవీ

# అప్పుడు.. ఇప్పుడు..

సంక్రాంతి సెలవులకో, దసరా సెలవులకో స్వస్థలాలకు వెళ్లి ఎంజాయ్ చేయడమంటే ఎవరికైనా ఇష్టమే. పుట్టిన ఊళ్లో మనం చదువుకున్న స్కూలు, తిరిగిన ప్రదేశాలు, చిన్ననాటి స్నేహితులు... అన్నీ కూడా తీపి గుర్తులే. చైనాలో కూడా కొత్తయేడాది వేడుకలను (స్ప్రింగ్ ఫెస్టివల్) జరుపుకునేందుకు భారీ సంఖ్యలో సొంత ఊళ్లకు వెళ్తుంటారు. ‘చిన్ననాటి ఫోటో జ్ఞాపకాన్ని జతచేస్తూ అచ్చు అలాగే, అదే స్నేహితులతో, అదే ప్రదేశంలో లేటెస్ట్‌గా ఫోటో దిగి పంపించండి’ అని ఒక పత్రిక ప్రకటన ఇస్తే వేలాది ఫోటోలు వచ్చాయట. వాటిలో కొన్ని ఇవి. కొందరివి 20 ఏళ్ల జ్ఞాపకమైతే, ఇంకొందరివి 18 ఏళ్ల జ్ఞాపకాలు... ఐడియా బాగుంది కాబట్టే భలేగా ‘క్లిక్’ అయ్యింది.













## సైనస్ సమస్య మళ్లీ రాదు

**ముక్కు** కళ్ల చుట్టూ నాలుగు గదులుంటాయి. వాటిని సైనస్‌లు అంటారు. ఈ సైనస్‌లలో వైరల్, బాక్టీరియా, ఫంగల్ ఇన్‌ఫెక్షన్ కారణంగా విపరీతమైన నొప్పి పుడితే దాన్ని సైనసైటిస్ అంటారు.

**కారణాలు :** సైనస్ ముఖద్వారం మూసుకుపోతుంది లేదా అక్కడ చాలా మ్యూకస్ పేరుకుపోతుంది. ఫలితంగా అక్కడ బాక్టీరియా, ఇతర క్రిములు సులభంగా పెరిగి సైనసైటిస్ సమస్య మొదలవుతుంది. శ్వాసకోశ మార్గానికి ఇన్‌ఫెక్షన్ రావటం వల్ల సైనస్‌లకు బాక్టీరియా ఇన్‌ఫెక్షన్ వస్తుంది. ఫలితంగా సైనసైటిస్ మొదలవుతుంది.

**గుర్తించటం సులభం:** తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది. ఆ పైన ముక్కు నుంచి పసుపు పచ్చని, ఆకుపచ్చని ద్రవాలు రావడం మొదలవుతుంది. తీవ్రమైన తలనొప్పి, దగ్గు, శ్వాస దుర్గంధంతో కూడి ఉండటం కూడా జరుగుతుంది. ముఖంలో వాపు కనిపిస్తుంది. గొంతు మంటగా, నోరంతా చేదుగా మారుతుంది.

**సర్జరీ అవసరం లేదు :** హోమియోపతి చికిత్స వల్ల సర్జరీ అవసరం లేకుండానే సైనసైటిస్‌ను సమూలంగా తగ్గించుకోవచ్చు. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇతర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం కలుగుతుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. కానీ హోమియో చికిత్సతో సమస్య సమూలంగా తొలగిపోతుంది.

## హెపటైటిస్, హెర్పిస్‌కు చెక్ సాధ్యమే

**హెపటైటిస్** వైరస్ ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తుందో అప్పుడు లక్షణాలు బయటపడతాయి. అంతవరకు ఇది సోకిన విషయం తెలియదు. హెపటైటిస్ వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్లు పడుతుంది. కొంతమందిలో వైరస్ సోకిన 4 వారాలు లేదా 12 వారాల తరువాత కొన్ని రోగలక్షణాలు బయటపడతాయి. ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వ్యాధి నిర్ధారణ కోసం హెపటైటిస్-బి(హెచ్‌బిఎస్ ఏజి) పరీక్ష చేయించాలి. హెపటైటిస్-బి ఉన్న కొందరిలో లివర్ ఫెయిల్యూర్‌కు దారితీస్తుంది. కొన్ని ఏళ్ల నుంచి వైరస్ ఉన్నవారిలో కాలేయం క్రమంగా దెబ్బతింటూ లివర్ సిర్రోసిస్‌కు దారితీయవచ్చు లేక లివర్ క్యాన్సర్‌గా మారవచ్చు.

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బి, సి వ్యాధులను సమర్ధవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.

**Dr. K Ravikirane**
**M.D.,M.sc(psych), P.G(virology)LONDON**
**గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్**
**మాస్టర్స్ హోమియోపతి**
**అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి**
**ఫోన్ : 7842 106 106, 9032 106 106**
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## కిడ్నీలో రాళ్లకు ఆపరేషన్ ఎందుకు?

**ఏ** పనైనా సాఫీగా జరుగుతున్నంత సేపు ఏ ఇబ్బంది ఉండదు. ఏదైనా ఆటంకం ఏర్పడినప్పుడే దాని ప్రభావం ఏస్థాయిలో ఉంటుందో అర్థమవుతుంది. మూత్రవిసర్జన విషయంలోనూ అంతే. కిడ్నీలో ఏర్పడిన రాళ్లు మూత్రనాళంలో అడ్డుపడితే ఆ బాధ చెప్పనలవికాదు.

**కారణాలు :** శరీరంలో తయారయ్యే మలిన పదార్థాలన్నీ మూత్రం ద్వారానే బయటకుపోతాయి. మలినాలన్నీ కరిగిన స్థితిలో మూత్రం ద్వారా బయటకు వెళితే ఏ సమస్యా ఉండదు. అలా కాకుండా మూత్రం విసర్జన సాఫీగా జరగకపోతే గాఢత పెరిగిపోయి మలినాలు రాళ్లగా ఏర్పడతాయి. సాధారణంగా కిడ్నీ స్టోన్స్ రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి కాల్షియం ఆక్సలేట్, యూరికాసిడ్. కొంతమందిలో మెటబాలిక్ సమస్య వల్ల కూడా రాళ్లు ఏర్పడతాయి.

**లక్షణాలు :** కిడ్నీలో ఏర్పడిన రాయి ఒక్కోసారి మూత్రనాళంలో అడ్డుపడుతుంది. ఫలితంగా కిడ్నీలో వాపు వస్తుంది. తీవ్రమైన నొప్పి, మూత్రంలో మంట, జ్వరం వంటి లక్షణాలు కనిపిస్తాయి. మూత్రంలో రక్తం కూడా రావచ్చు. మూత్రవిసర్జన సమయంలో తీవ్రమైన నొప్పి వస్తుంటుంది. నొప్పి వెనక నుంచి ముందుకు విస్తరిస్తూ ఉంటుంది.

**హోమియో వైద్యం :** ఆపరేషన్ కోసం పరిగెత్తకుండా హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా రాళ్లు సులభంగా తొలగిపోయేలా చూసుకోవచ్చు. మూత్రనాళంలో రాయి అడ్డుపడినట్లయితే హోమియో మందులు మూత్రనాళం వ్యాకోచం చెందేలా చేసి రాయి పడిపోయేలా చేస్తాయి. అంతేకాకుండా హోమియో మందులు శరీరతత్వాన్ని మార్చుతాయి. ఫలితంగా రాళ్లు తయారయ్యే అవకాశం తగ్గిపోతుంది. కిడ్నీలో రాయి ఉంది అనగానే గాభరా పడిపోకుండా అనుభవజ్ఞులైన హోమియో వైద్యున్ని సంప్రదిస్తే సమస్య ఇట్టే తొలగిపోతుంది.

## ఎసిడిటీని ఎన్నాళ్లు భరిస్తారు?

**ఎసిడిటీ, గ్యాస్ట్రైటిస్ :** జీవనశైలిలో మార్పులు అంటే సమయానికి భోజనం చేయకపోవడం, మసాలా, వేపుళ్లు ఎక్కువగా తీసుకోవడం, మాంసాహారం అధికంగా తినడం, మానసిక ఒత్తిడి, నిద్రలేమి వంటివి గ్యాస్ట్రైటిస్ సమస్యకు కారణమవుతాయి.

**లక్షణాలు :** పుల్లటి తేన్పులు, వాంతులు, కడుపులో మంట, కడుపు ఉబ్బరం వంటి లక్షణాలుంటాయి. కొద్దిగా ఆహారం తీసుకున్నప్పటికీ పొట్ట నిండినట్లుగా అనిపించడం, ఆకలి లేకపోవడం, కారణం లేకుండానే బరువు తగ్గిపో తుండటం వంటి లక్షణాలు ఉంటాయి.

**చికిత్స :** రోగి లక్షణాలు, శారీరకపరిస్థితిని పరిశీలించి మందులు ఇవ్వాల్సి ఉంటుంది. చికిత్స తీసుకోవడంతో పాటు జీవనశైలిలో మార్పులు చేసుకున్నట్లయితే మంచి ఫలితం ఉంటుంది. వేళకు భోజనం చేయడం, కారం, ఉప్పు, నూనె తగ్గించడం చేయాలి.

**అల్సర్స్(గ్యాస్ట్రిక్, పెప్టిక్) :** మ్యూకస్ మెంబ్రేన్ యందు పుండులాగా కావడాన్ని అల్సర్ అంటారు. అల్సర్ ఏ భాగంలో అయితే ఆ పేరుతో పిలుస్తారు. ఆహారవాహికలో ఉన్నట్లయితే ఒసియోఫేగల్ అల్సర్, జీర్ణకోశంలో ఉన్నట్లయితే గ్యాస్ట్రిక్ అల్సర్, చిన్న పేగు మొదటి భాగంలో ఉన్నట్లయితే డ్యుయోడినల్ అల్సర్ అని పిలుస్తారు.

**లక్షణాలు :** తినేముందు లేదా తిన్న తరువాత కడుపులో నొప్పి, కడుపు ఉబ్బరంగా ఉండటం, పుల్లటి తేన్పులు, తలతిరగడం, వాంతులు వంటి లక్షణాలు ఉంటాయి. వ్యాధి ముదిరినపుడు రక్తంతో కూడిన వాంతులు, భరించలేని కడుపునొప్పి, బరువు తగ్గిపోవడం జరుగుతుంది.

**చికిత్స :** అల్సర్‌ను సమూలంగా తొలగించే మందులు హోమియోలో ఉన్నాయి. ఆహారపు అలవాట్లు మార్చుకొని క్రమం తప్పకుండా మందులు వాడినట్లయితే సమస్యకు శాశ్వత పరిష్కారం లభిస్తుంది.

ADVT



# ఎం దు కు...?

## వైద్యశాలల్లో క్రాస్ గుర్తు...?



చదువురాని వాళ్లు, స్థానిక భాష రాని వాళ్లు సులభంగా అర్థం చేసుకోగలిగేది సంకేతం. అందుకే చాలా వాటికి సంకేతాలు వాడతారు. వైద్యశాలలకు క్రాస్ గుర్తును వాడడం అలాంటిదే! ఈ గుర్తును 'రెడ్ క్రాస్ చిహ్నం' అంటారు. ఎందుకంటే రెడ్‌క్రాస్ సంస్థ యుద్ధాల్లో, ప్రకృతి వైపరీత్యాల్లో, ప్రమాదాల్లో గాయపడిన వారికి వైద్య సహాయం అందజేసేది. ఆ సంస్థ గౌరవార్థం రెడ్‌క్రాస్‌నే వైద్యశాలలకు గుర్తుగా తీసుకున్నారు. క్రాస్ గుర్తులోని ఎరుపు రంగు డాక్టర్లకు సంబంధించినదైతే, గ్రీన్ రంగు ఫార్మసీకి అంటే మందులకు సంబంధించినది. అందుకే హాస్పిటల్స్ దగ్గర ఎరుపు రంగు క్రాస్‌ను, మెడికల్ షాపుల దగ్గర పచ్చరంగు క్రాస్‌ను ఉంచుతారు.



## పూలలో తేనె ఉంటుంది...?



ప్రతి జీవీ ప్రత్యుత్పత్తి ద్వారా తన సంతానాన్ని వృద్ధి చేసుకుంటుంది. చెట్లు కూడా దానికి మినహాయింపు కావు. చెట్టు నుంచి మరో చెట్టు పుట్టాలంటే విత్తనం కావాలి. ఆ విత్తనం ఉండేది పండులో. ఆ పండు పువ్వు నుంచి వస్తుంది. ఆ పువ్వు ఫలదీకరణం చెందాలంటే వేరొక పువ్వు పుప్పొడి దానికి కావాలి. అందుకే అది మకరందాన్ని స్రవిస్తుంది. ఆ మకరందాన్ని గ్రోలడానికి వచ్చే కీటకాల ద్వారా పరపరాగ సంపర్కం జరిగి పువ్వు కాయ అవుతుంది.

## ఎర వేశానంతే!

"నిన్నటిదాక ద్రౌపది పాత్ర వేయమని బతిమాలినా ససేమిరా అన్న ఆ ఇద్దరు హీరోయిన్లూ ఈవాళ నేనంటే నేనని ఎగబడుతున్నారేం?" ఆశ్చర్యంగా అడిగాడు నిర్మాత.

"వస్త్రాపహరణం సీన్‌లో నటించిన హీరోయిన్‌కే ఆ చీరలన్నీ ఇచ్చేస్తానని చెప్పాను" వివరించాడు దర్శకుడు.

## మిక్స్చర్ పొట్లం

బొమ్మలు : **వెంకట్**

### కరిగించాలి కదా!



"డాక్టర్‌గారూ, ప్లాస్టిక్ సర్జరీకి ఎంతవుతుంది?" అడిగాడు అనంతం.

"50 వేలు .." చెప్పాడు డాక్టర్.

"ఒకవేళ ప్లాస్టిక్ మేమే తెచ్చుకుంటే .. తగ్గుతుందంటారా?" తెలివిగా అడిగాడు అనంతం.

"అప్పుడు లక్షకు పైగా అవుతుంది. ప్లాస్టిక్ కరిగించాలి కదా.." కోపంగా చెప్పాడు డాక్టర్.

## కెమిస్ట్రీ మొగుడు!

"రాత్రి 12 అవుతోంది .. మీరింకా ఇల్లు చేరలేదేం?" కాల్ చేసింది అమ్మాజీ.

"ఓ ముఖ్యమైన ప్రయోగంలో ఉన్నాం డియర్" చెప్పాడు అజయ్.

"ఏంటా ప్రయోగం?" అనుమానంగా అడిగింది అమ్మాజీ.

"c2H50H ద్రావణానికి కాస్త H2o మరికాస్త C2o కలిపాం. దాన్ని ఘనభవించిన H2o తో బాగా శీతలీకరించాం. ఇంకా కొన్ని ప్రొటీన్లు రావల్సి ఉంది. ఈ లోపు నికోటిన్ మండిస్తున్నాం. ఇప్పటిదాకా అయిదు రౌండ్ల ప్రయోగాలయ్యాయి.." చెప్పాడు అజయ్ విస్కీ గ్లాసులో ఒంపుకుంటూ.

### వెల్‌కమ్ డాడీ!



"డాడీ రేపు మా స్కూల్లో ఒక చిన్న గెట్‌టు గెదర్ ఉంది" సన్.

"చిన్నదా .. ఎవరెవరొస్తున్నారు?" డాడీ.

"మీరు, నేను, ప్రిన్సిపాల్ - అంతే" సన్.

## ఛాయా'చిత్రం'



ఫైటింగ్ రిహార్సల్స్!

## సంతలో సడేమియా

పోలింగ్‌బూత్‌లో ఓటు వేసిన తర్వాత -
"సార్, ఇప్పుడు నా వేలుకు మీరు పెట్టిన నల్లరంగు కడిగేస్తే పోతుందా?" అడిగాడు రామతీర్థం.
"పోదు .. " చెప్పాడు ఎలక్షన్ ఆఫీసర్.
"సబ్బుతో కడిగినా పోదా?" తీర్థం.
"ఏడాది తర్వాత కడిగినా పోదు ... వెళ్లు వెళ్లవయ్యా" కోపంగా అరిచాడు ఆఫీసర్.
"సార్ .. ప్లీజ్ దయచేసి దాన్ని నా జుట్టుక్కూడా పూయండి. ఎన్నిసార్లు డై చేసుకున్నా వారానికే రంగు పోతోంది" బతిమాలాడు రామతీర్థం.

## ఎవరు గొప్ప?



బస్సు డ్రైవర్, పూజారి ఒకేసారి స్వర్గానికి వెళ్లారు. బస్సు డ్రైవర్‌ను పట్టువస్త్రాలతోనూ, పూజారిని నూలు వస్త్రాలతోనూ ఆహ్వానించాడు దేవుడు.
"నిరంతరం నీ ప్రవచనాలు చెప్పే నాకేమో నూలు దుస్తులా? ఆ డ్రైవర్‌కు పట్టువస్త్రాలా? ఇది అన్యాయం దేవా .." గొల్లుమన్నాడు పూజారి.
"నువ్వు ప్రవచనాలు చెప్పేటప్పుడు భక్తులు ఎంచక్కా నిద్రపోయేవారు. కాని ఈ డ్రైవర్ బస్సు నడిపినంత సేపూ భక్తులు నా నామస్మరణ చేస్తూనే ఉండేవారు - మీ ఇద్దరిలో ఎవరు గొప్పో నువ్వే చెప్పు" వివరించాడు దేవుడు.

## అదీ విషయం!

"మాస్టారూ .. మా నాన్న మిమ్మల్ని ఈ ఆదివారం మా ఇంటికి రమ్మన్నారండి" చెప్పాడు బుజ్జిపండు.
"నాతో మీ నాన్నగారికేం పని .." ఆశ్చర్యపోయాడు మాస్టారు.
"సున్నాలేసేవాడిని తీసుకురమ్మన్నాడు మా నాన్న .. మీరే కదా సున్నాలేసేది" చెప్పాడు బుజ్జిపండు.

ఈ వారం కవితలు

## పంజరంలోనే...

జీవితమొక బంగారు పంజరం
నువ్వూ నేనూ అందులో బందీలం

ఎన్ని తాళాలు ఈ పంజరానికి
మరెన్ని తాళం చెవులు



అమ్మానాన్నల దగ్గరొకటి
తోడబుట్టిన వాళ్ల దగ్గరొకటి
కట్టుకున్న వాళ్ల దగ్గరొకటి
కడుపున పుట్టిన వాళ్ల దగ్గరొకటి

మన కులం దగ్గర
మన మతం తగ్గర
ఆఖరికి మన జెండర్ దగ్గరా
తలా ఒకటి

ఒంటికి కావాల్సినవన్నీ
పంజరంలోనే అమర్చి ఉంటాయి
రెక్కలకి కావాల్సిందేదో
బైట ఉంటుంది

మనం
ఎప్పటికీ ఎగరలేక
పంజరంలోనే బూడిదైపోతాం

**- వెంకటేష్ పైడికొండల, 81215 33112**

బొమ్మలు : **అక్బర్**

## రెండు నిశ్శబ్దాలు



ఇప్పుడు
ఒక్కో తలపు పేర్చుకుని
ఒక్క గూటిలో చేర్చుకోవాలి
ఒక్కో సమాగమనాన్ని
మనసు నిండా పొదివిపట్టుకుని
మన మధ్య నాటుకోవాలి
ఒక్కో స్వరాన్ని కూడగట్టుకుని
నమ్మకంగా నిలుపుకునే దారేదో తెలుసుకోవాలి
ఒక్కో బిడియాన్ని తుంచివేస్తూ
కాస్త తెగింపుని
దట్టించి బాటగా మలుచుకోవాలి
నువ్వు నేను
అవును మరి
రెండు నిశ్శబ్దాల మధ్య
మనసు ముళ్లు వేసుకోవాలి

**- లాస్య ప్రియ, 96405 51664**

# అనుగ్రహం

12-18 ఫిబ్రవరి 2017

డాక్టర్ పి.ఎ.రామన్



**మేషం : అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం**

గృహమార్పు యత్నం ఫలిస్తుంది. నూతనోత్సాహంతో ముందుకు సాగుతారు. యత్నాలకు పరిస్థితులు అనుకూలిస్తాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. మంగళ, శని వారాల్లో ఖర్చులు విపరీతం. ఆశలొదిలేసుకున్న బాకీలు వసూలవుతాయి. ఆప్తులకు సాయం అందిస్తారు. దంపతుల మధ్య ప్రేమానురాగాలు పెంపొందుతాయి. సంతానం భవిష్యత్తుపై శ్రద్ధ వహించండి. ఆరోగ్యం స్థిరంగా ఉంటుంది. స్తోమతకు మించి హామీలివ్వవద్దు. ప్రయాణంలో జాగ్రత్త.



**వృషభం : కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

మీ శ్రమ వృధా కాదు. ఉపకారానికి ప్రత్యుపకారం పొందుతారు. ఆలోచనలు కార్యరూపం దాల్చుతాయి. వేడుకలను ఆడంబరంగా నిర్వహిస్తారు. పరిచయాలు, బంధుత్వాలు బలపడతాయి. గురు, శుక్ర వారాల్లో పనుల సానుకూలతకు మరింతగా శ్రమించాలి. ప్రముఖులతో సంప్రదింపులు జరుపుతారు. ఖర్చులు అధికం, ప్రయోజనకరం. ఒక వ్యవహారంలో ధనం అందుతుంది. ఆంతరంగిక, బ్యాంకు వివరాలు గోప్యంగా ఉంచండి. అవగాహన లేని విషయాల్లో జోక్యం తగదు.



**మిథునం : మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

కొత్త బాధ్యతలు స్వీకరిస్తారు. అప్రమత్తంగా వ్యవహరించాలి. మొహమాటాలు, ఒత్తిళ్లకు లొంగవద్దు. మీ అభిప్రాయాలను కచ్చితంగా తెలియజేయండి. ఖర్చులు విపరీతం. చేతిలో ధనం నిలబడదు. పనుల ప్రారంభంలో ఆటంకాలెదురైనా అనుకున్న విధంగా పూర్తి కాగలవు. శనివారం నాడు ఒక సంఘటన ఆందోళన కలిగిస్తుంది. ప్రముఖులను కలుసు కుంటారు. సన్నిహితుల సాయంతో ఒక సమస్య సానుకూలమవుతుంది.



**కర్కాటకం : పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

ఆర్థికస్థితి సామాన్యం. ఏ పురోగతి లేక నిరుత్సాహం చెందుతారు. ఖర్చులు అధికం. అవసరాలు అతికష్టంమ్మీద తీరుతాయి. ఆరోగ్యం మందగిస్తుంది. విశ్రాంతి అవసరం. అతిగా ఆలోచించవద్దు. పనులు ఆలస్యంగానైనా అనుకున్న విధంగా పూర్తి కాగలవు. కొత్త విషయాలు గ్రహిస్తారు. మీ శ్రీమతి వైఖరిలో ఆశించిన మార్పు వస్తుంది. అయిన వారితో సంప్రదింపులు జరుపుతారు. అనాలోచిత నిర్ణయాలు తగదు.



**సింహం : మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

ఇచ్చిన మాట నిలబెట్టుకుంటారు. బంధుత్వాలు బలపడతాయి. అవకాశాలను సద్వినియోగం చేసుకుంటారు. ఖర్చులు సామాన్యం. కుటుంబ విషయాలపై శ్రద్ధ అవసరం. బాధ్యతలు అప్పగించి ఇబ్బందులెదుర్కుంటారు. అపరిచితులతో జాగ్రత్త. పదవులు చేజిక్కించుకుంటారు. గౌరవ ప్రతిష్టలు పెంపొందుతాయి. తొందరపడి హామీలివ్వవద్దు. అవివాహితుల్లో ఉత్సాహం నెలకొంటుంది. విద్యార్థులకు ఏకాగ్రత లోపం, ఒత్తిడి అధికం. ఆరోగ్యం స్థిరంగా ఉంటుంది. వాహనం నడిపేటపుడు జాగ్రత్త.



**కన్య : ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

బంధుమిత్రుల ఆగ్రహానికి గురవుతారు. మీ మాట తీరు అదుపులో ఉంచుకోవాలి. వాగ్వాదాలు, పంతాలకు పోవద్దు. ఊహించిన ఖర్చులే ఉంటాయి. ధనానికి ఇబ్బంది ఉండదు. ఆది, సోమ వారాల్లో వ్యయప్రయాసలతో పనులు పూర్తి చేస్తారు. ఆత్మీయులతో సంప్రదింపులు జరుపుతారు. నగదు, ఆభరణాలు జాగ్రత్త. ప్రముఖుల ఇంటర్వ్యూ కోసం పడిగాపులు తప్పవు. అవకాశాలను తక్షణం వినియోగించుకోండి. ఎవరినీ సలహా అడుగవవద్దు. సొంత నిర్ణయాలే శ్రేయస్కరం.



**తుల : చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

విమర్శలు, అభియోగాలకు దీటుగా స్పందిస్తారు. కార్యసాధనకు ఓర్పు, పట్టుదల ప్రధానం. పనుల సానుకూలతకు అవిశ్రాంతంగా శ్రమిస్తారు. కొంత మొత్తం ధనం అందుతుంది. మంగళ, బుధ వారాల్లో ఊహించని ఖర్చులుంటాయి, అవగాహన లేని విషయాల్లో జోక్యం తగదు. ఆత్మీయులకు వివాహ సమాచారం అందిస్తారు. దంపతుల మధ్య అన్యోన్యత నెలకొంటుంది. ఆహ్వానాలు, నోటీసులు అందుకుంటారు. వ్యవహార ఒప్పందాల్లో తొందరపాటు తగదు.



**వృశ్చికం : విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

వ్యవహారానుకూలత, ప్రశాంతత పొందుతారు. శుభకార్యం నిశ్చయమవుతుంది. పెట్టిపోతలు, ఇచ్చిపుచ్చుకునే వ్యవహారాలలో జాగ్రత్త. స్తోమతకు మించి హామీలివ్వవద్దు. ఆదాయ వివరాలు గోప్యంగా ఉంచండి. గురు, శుక్ర వారాల్లో మీ బలహీనతలు అదుపులో ఉంచుకోండి. పరిచయం లేని వారు తప్పుదారి పట్టించే ఆస్కారం ఉంది. సన్నిహితుల సలహా పాటించండి. ఖర్చులు విపరీతం, రావలసిన ఆదాయంపై దృష్టి సారిస్తారు. ఆరోగ్యం స్థిరంగా ఉంటుంది.



**ధనుస్సు : మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

వాగ్ధాటితో ఆకట్టుకుంటారు. పరిచయాలు ఉన్నతికి దోహదపడతాయి. పదవులు, బాధ్యతలు స్వీకరిస్తారు. ఒత్తిడి, మొహమ్మాటాలకు తలొగ్గవద్దు. శనివారం నాడు పనులు హడావుడిగా సాగుతాయి. ఖర్చులు అధికం, ప్రయోజనకరం. సకాలంలో చెల్లింపులు జరుపుతారు. అప్రయత్నంగా అవకాశాలు కలిసివస్తాయి. స్వయంకృషితో అనుకున్నది సాధిస్తారు. అస్వస్థతకు గురవుతారు. వైద్యసేవలు అవసరమవుతాయి.



**మకరం : ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ట 1,2 పాదాలు**

ఆర్థిక, న్యాయ నిపుణులతో సంప్రదింపులు జరుపుతారు. ఆలోచనలు పలు విధాలుగా ఉంటాయి. ఏ విషయంపై ఆసక్తి ఉండదు. ఆత్మీయుల కలయికతో కుదుటపడతారు. పనులు మందకొడిగా సాగుతాయి. ఖర్చులు విపరీతం. అవసరాలకు ధనం అందుతుంది. ఆరోగ్యం సంతృప్తికరం. శుభకార్యానికి యత్నాలు సాగిస్తారు. విలువైన వస్తువులు, నగదు జాగ్రత్త. ఆది, సోమ వారాల్లో బాధ్యతలు అప్పగించవద్దు.



**కుంభం : ధనిష్ట 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

ఆహ్వానం అందుకుంటారు. పనులు తేలికగా పూర్తవుతాయి. ఆందోళన కలిగించిన సమస్య సద్దుమణుగుతుంది. అవకాశాలను సద్వినియోగం చేసుకుంటారు. మంగళ, బుధ వారాల్లో ఇతరుల విషయాల్లో జోక్యం తగదు. మితంగా సంభాషించండి. మీ మాటలను అపార్థం చేసుకునే ఆస్కారం ఉంది. శకునాలు, విమర్శలు పట్టించుకోవద్దు. అయిన వారితో ఉత్సాహంగా గడుపుతారు. ఖర్చులు విపరీతం. విలాసాలకు బాగా వ్యయం చేస్తారు. నగదు, విలువైన వస్తువులు జాగ్రత్త.



**మీనం : పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

బాధ్యతగా వ్యవహరించాలి. ఎదుటివారి అభిప్రాయాలకు విలువ ఇవ్వండి. పెద్ద ఖర్చు తగిలే సూచనలున్నాయి. ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు. పనులు అస్తవ్యస్తంగా సాగుతాయి. వాగ్వాదాలకు దిగవద్దు. ఆది, గురు వారాల్లో కొన్ని విషయాలు చూసీ చూడనట్టుగా వదిలేయండి. ప్రియతములను కలుసుకుంటారు. సంతానం చదువుల పట్ల శ్రద్ధ అవసరం. స్వల్ప అస్వస్థతకు గురవుతారు. అతిగా ఆలోచింపవద్దు. నోటీసులు, కీలక పత్రాలు అందుతాయి. ప్రయాణానికి అనుకూలం.

## అవునా!



ప్రపంచంలో అత్యంత పెద్ద పది విగ్రహాల్లో ఎనిమిది బుద్ధ విగ్రహాలే!

b ఓ మనిషి తన జీవితకాలంలో 38 రోజులు బ్రష్ చేసుకోవడం కోసం వెచ్చిస్తాడు.

b సీల్ చేపలకి వ్యాధులు వ్యాపిస్తాయనే భయంతో 1994 ఏప్రిల్ నుంచి అంటార్కిటికా లోకి కుక్కలను రానివ్వట్లేదు.



ఇగ్వానా (iguana) అనే బల్లి జాతికి చెందిన సరీసృపానికి తలపై మూడో కన్ను ఉంటుంది. దాని పని కేవలం కాంతిని గ్రహించడమే!

b డెన్మార్క్, నార్వేలను ఉమ్మడిగా పాలించిన రాజు 'హెరాల్డ్ బ్లూటూత్' పేరు మీదుగా 'బ్లూటూత్' అనే పదం వచ్చింది.

b 1940లలో ఎక్స్‌రే యంత్రాల్ని ప్రయోగాత్మకంగా షూ షాపుల్లో ఉంచారు.



'గైస్' అనే పదం రావడానికి కారణం 16వ శతాబ్దానికి చెందిన గై ఫాక్స్ (Guy Fawkes) అనే ఇంగ్లండు సైనికుడు.

b 1945లో తయారు చేసిన తొలి అణుబాంబును 'ది గాడ్జెట్' అనే నిక్‌నేమ్‌తో పిలుస్తారు.

b యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా, లైబీరియా, మయన్మార్ దేశాలు మాత్రమే ఇప్పటికీ మెట్రిక్ పద్ధతిని అధికారికంగా గుర్తించలేదు.

# అదృష్ట రత్నజ్యోతి


## రమేశ్చంద్ర మహర్షి

సెల్ : 92465 82255, ఫోన్ : 040-6522 5554


**కె.వి.ఆర్., హైద్రాబాద్**

**మా అమ్మాయి జన్మకుండలి నిర్మొహమాటంగా వివరించగలరు.**

ఈ జన్మకుండలి ప్రకారం-

నక్షత్రం ఆశ్లేష. కర్కాటక రాశి.

1. తండ్రికి ఉద్యోగం విద్యాసంస్థలో, బృహస్పతి వలన.

2. ఈమె ప్రథమ సంతానం.

3. ఈమెకు ఒక చెల్లెలుంటుంది, శుక్రుని కారణంగా.

4. ఆ చెల్లెలు మెడిసిన్ చేస్తుంది. డిగ్రీ ఇతర రాష్ట్రంలో, పి.జి. విదేశాల్లో అన్నట్టుగా సాగే విద్య.

5. ఇక ఈ జాతకురాలి విద్య సైన్స్.

6. తన 20 నుండి 40 మధ్య నడిచే శుక్ర దశ బాగుంటుంది. బృహస్పతి, వాక్‌స్థానాధిపతి ఉచ్ఛపట్టడం, వారి స్థితిగతుల వలన ఈమె వృత్తి టీచింగ్ అవుతుంది.

7. దానిలో మంచి స్థితికి హంస మహాయోగం, కేతువుకు పరిహారాలు పాటిస్తే, తన పూర్తి సహకారం అందిస్తుంది.

8. రవి వలన ప్రభుత్వోద్యోగంలో చేరడం, రవి, కుజ, గురుల వలన ప్రిన్సిపాల్ స్థాయికి చేరుకోవడం ఉంటుంది!

9. కనకపుష్యరాగం ధరించడం వలన యోగం పడుతుంది.

10. తన 20 నుండి 23 మధ్య శుక్రునిలో శుక్రునిలో ప్రేమలో పడడం. దీనికి చంద్ర లగ్నం నుండి పూర్తి సహకారం. తండ్రికి చేంజాఫ్ సెక్షన్.

11. 24లో ప్రభుత్వోద్యోగంలో ప్రవేశం. చెల్లెలికి, తండ్రికీ కూడా మంచి కాలం. తల్లికి అనారోగ్యం, తల్లి తమ్మునికి గండకాలం.

12. 25, 26లో చంద్రుని భుక్తి. వివాహం. పైన చెప్పుకున్న లవ్ ఎఫైర్... లవ్ మ్యారేజ్‌గా రూపం తీసుకోవడం. అయితే ఇదే పీరియడ్‌లో ఒక నిజం ఈమెను వేదనకు గురిచేయడం జరుగుతుంది. అధిపతికి షష్టమ స్థితి, కంట్రోలింగ్ ఫేక్టర్ శత్రువు, కుజ కేతువుల వీక్షణ, రవి శనుల దిగ్బంధనం, కారకుని మీద తిరిగి శని కేతువుల ప్రభావం... సంతానం కలగడం సాధారణంగా జరిగిపోయే విషయం కాదని, "ఈ జాతకం వరకూ" దానికి కూడా తపస్సు చేయాల్సి ఉంటుందనీ బోధపడడం బాధాకరం!

షట్కర్ణాత్ భిద్యతే మంత్రః!

ఈ విషయం అమ్మాయికి తెలియకుండా జాగ్రత్తపడండి.

13. 26, 27లో ఉద్యోగంలో ఊహించని ఉన్నతి. సంతానానికి ప్రయత్నించుకోవలసిన పీరియడ్. అయినా సంతానం కలగదు. తనకు ధనయోగం, తండ్రికి ఛేంజాఫ్ ప్లేస్ ఒద్దంటే ప్రయాణం... అప్ అన్డ్ డౌన్ చేయడం... చెల్లెలికి విదేశయానం. తల్లి ఆరోగ్యం విషయంలో ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలి.

14. 28, 29, 30లలో ఈమె వైవాహిక జీవితానికి గండం... తుపాను! శుక్రునిలో రాహువులో... అంటే ఈ మూడేళ్ళూ కోర్టులో లీగల్ మ్యాటర్ నడుస్తుంది. ఈ పీరియడ్‌లో ఎవరికి ఎన్ని పరిహారాలు పాటించినా కూడా విషయం విడాకులకు వెళ్తుంది.

15. 30, 31లో శుక్రునిలో బృహస్పతి. మళ్ళీ కళ్యాణ ఘడియలు. ఇక్కడ చిత్ర మేమంటే... ఏ పిల్లలు కలగడం లేదని మొదటి వివాహం విడాకులకు దారితీసిందో, రెండవ వివాహం జరిగిన ఏడాది లోపల సంతానం కలగడంతో, విడాకులవ్వడం బ్లెసింగ్ ఇన్ డిస్‌గైజ్ అవుతుంది. దీనికి మూలకారణం ఈమె జాతకం ప్రకారం మొదటి భర్తకు సంతాన యోగం ఉండదు. రెండవ భర్తకు సంతాన యోగం పుష్కలంగా ఉంటుంది. అప్పటివరకూ సంతానం లేదని పడిన బాధ, ఆ విధంగా రెండవ వివాహంతో సమసిపోతుంది!

"ఆగతం స్వాగతం, కుర్యాద్గచ్ఛంతం న నివారయేత్" మన నుండి వెళ్ళిపోయే వాటిని/వారిని ఆపకూడదు!

ఇక్కడ మొదటి వివాహం చెడిపోయి, రెండవ వివాహం జరగడమే ఈమె సమస్యకు పరిహారంగా మారడం... విచిత్రమే!!

అనువాద కథ

# నల్ల కిడ్నీ

ఇంగ్లీష్ మూలం : **ఆనంద వాసుదేవన్**
తెలుగు : **డాక్టర్ దేవరాజు మహారాజు**



బొమ్మలు
చారి పి.యస్.

**ఒక రోజు ఉదయం కోర్టు బయట పెద్ద గలాటా జరుగుతోంది. ఆ సమయంలో నేను నా పనిలో తలమునకలై ఉన్నాను. బయటి నుంచి వినిపించే అరుపులు నా పనికి అంతరాయం కలిగిస్తున్నాయి. భద్రతా సిబ్బందిని పిలిచి విషయమేమిటో కనుక్కుని రమ్మన్నాను. సార్జంట్ బయటికి వెళ్ళొచ్చి కొందరు నల్లజాతి వాళ్ళు గుంపుగా వచ్చారనీ, నన్ను కలిసి ఏదో వినతిపత్రం ఇస్తామని గొడవ చేస్తున్నారనీ చెప్పాడు. విషయమేదో తెలుసుకుని పంపిస్తే సరిపోతుంది కదా గొడవెందుకూ? అని అనిపించి వారిలో ముఖ్యమైన ఇద్దరిని లోపలికి పంపించమన్నాను. వాళ్ళు గనుక స్వాహిలీ భాష మాట్లాడే వాళ్ళయితే, వారితో పాటు ఒక అనువాదకుణ్ణి కూడా పంపించమన్నాను.**

**రెం**డు నిమిషాల వ్యవధిలో ఇద్దరు లోపలికి వచ్చారు. వారిలో ఒక మధ్య వయస్కురాలు ఉంది. ఆమె థాంప్సన్ గురించి కొన్ని విషయాలు చెప్పింది. తాను వితంతువునని, తనకు ఒక కొడుకు ఉన్నాడని, వాడు థాంప్సన్ ఇంట్లో పని కుర్రాడనీ చెప్పింది. థాంప్సన్ తన కొడుకుని తుపాకితో కాల్చి చంపాడనీ, తను దిక్కులేనిదాన్నయిపోయాననీ, న్యాయం చేయమనీ ఏడ్చింది. ఇవన్నీ అనువాదకుడి సహాయం వల్ల తెలుసుకోగలిగాను.

"వెంటనే పోలీసులకు తెలపాల్సిన విషయం కదా ఇదీ?" అన్నాను. పోలీసులకు తెలిపారని, వారేమీ చేయలేకపోయినందువల్లనే వాళ్ళు నా దగ్గరికి వచ్చారని అన్నాడు అనువాదకుడు.

జార్జి థాంప్సన్ మామూలువాడు కాదు. బులవాయోలో ప్రముఖ యూరోపియన్ వ్యాపారి. ధనవంతుడు. పొగాకు తోటల అధిపతి. అంతటి వాడిపై అభియోగమా? నమ్మలేకుండా ఉంది. అయినా వచ్చిన వారికి నమ్మకం కలిగించి పంపించడం న్యాయమూర్తిగా నా ధర్మం కాబట్టి, "తప్పకుండా విషయం పరిశీలిస్తానని... ఎంత వారినైనా చట్టం వదిలిపెట్టద"ని సాంత్వన కలిగించే మాటలు చెప్పాను. పుత్రశోకంతో తల్లడిల్లిపోతున్న ఆమెను ఓదార్చమని... నా సిబ్బందికి చెప్పి పంపించాను.

'జార్జి థాంప్సన్ తన ఇంట్లో పనిచేసే కుర్రాడిని తుపాకితో కాల్చి చంపడమా?' ఏమాత్రం నమ్మశక్యంగా లేదు. పని కుర్రాణ్ణి చంపవల్సిన అవసరం అంత పెద్దమనిషికి ఎందుకొస్తుంది? థాంప్సన్ ధనవంతుడే కాదు, రొడీషియా (నేటి జింబాబ్వేకు పాత పేరు) ప్రముఖ వ్యక్తుల్లో ఆయనొకడు. ఉదార స్వభావం కలవాడు. మతమన్నా, దేవుడన్నా ఎంతో విలువిస్తాడు. కళలన్నా, సమాజసేవన్నా పడి చస్తాడు. గొప్ప గాయకుడు, మంచి రొమాంటిక్ ఫిగర్! తన వాళ్ళన్నా, తన జాతి వాళ్ళన్నా ఆయనకు అపారమైన ప్రేమ. ఇతరులను ద్వేషించడు. ఎంతోమంది నల్లజాతి వారికి పని కల్పించాడు. నల్లజాతి కుర్రాళ్ళను స్వయంగా తన ఇంట్లో నియమించుకున్నాడు కూడా!

థాంప్సన్‌కు మంచి కుటుంబం కూడా ఉంది. చక్కని భార్య, కొడుకూ, కూతురు... ముచ్చటైన సంసారం. కొడుకు ఆక్స్‌ఫర్డ్‌లో చదువుతున్నాడు. కూతురికి పెళ్ళి నిశ్చయమైంది. పార్లమెంట్ మెంబర్ కాకపోయినా, ఎన్నికల్లో ఆయన మాటే నెగ్గుతుంది. ఆయన నిలబెట్టినవారే ఎన్నికల్లో గెలుస్తారు.

ఎందుకైనా మంచిది. విషయం తెలుసుకుందామని పోలీసు సూపరింటెండెంట్ బ్రౌన్‌ని రమ్మని ఫోన్ చేశాను. ఆ సాయంత్రమే ఆయన నా దగ్గరికి వచ్చాడు. తనకు తెలిసిన సమాచారం కొంత చెప్పిపోయాడు.

"ఇదంతా కమ్యూనిస్టుల గొడవ సార్. మీకు తెలియనిదేముంది? థాంప్సన్ పెద్ద పెట్టుబడిదారు కాబట్టి, అతనంటే వీళ్ళకి పడదు. ఏవో నీచాతినీచమైన వదంతులు సృష్టించి ప్రచారం చేస్తారు. ఒక నల్లజాతి కుర్రాణ్ణి కాల్చి చంపాడని ఇప్పుడు కొత్తగా గొడవ చేస్తున్నారు."

"అసలు ఏమి జరిగి ఉంటుంది? విషయం ఏదైనా బయటికొచ్చిందా?" అని అడిగాను.

"అది ఒక దుర్ఘటన మాత్రమే! కావాలని కాల్చి చంపడం ఏ మాత్రం కాదు. ఆయన దగ్గర ఆయుధాలు ఉన్నమాట నిజమే గాని, ఇలా అలగా జనాన్ని కాల్చి చంపేందుకు కాదు. తన రక్షణ కోసం ఆయన ఏర్పాటు చేసుకున్నవవి. కొద్ది రోజుల క్రితం ఆయన తన దగ్గరున్న రైఫిళ్ళలో ఒకటి తీసి శుభ్రం చేస్తుంటే... అది అకస్మాత్తుగా పేలిందట. అందులో తూటాలున్న విషయం ఆయనకు తెలియదట. ఆ పేలిన తూటా దూసుకెళ్ళి పని కుర్రాడి వీపుకి తగిలింది. వెంటనే థాంప్సన్ గారు కుర్రాణ్ణి తన స్వంత కారులో ఎక్కించుకుని యూరోపియన్‌ల

ఆసుపత్రికి తీసుకెళ్ళారు.. అక్కడైతేనే కుర్రాడికి మంచి వైద్యం లభిస్తుందని ఆయన ఆశపడ్డారు. అయినా లాభం లేకపోయింది. అక్కడికి వెళ్ళిన కొద్దిసేపటికే కుర్రాడు మరణించాడు."

"ఓ ఐసీ! అలా జరిగిందా? కుర్రాడు చనిపోయింది నిజమేనన్న మాట! అయితే శవాన్నయినా ఆ తల్లికి అప్పగించాల్సింది. కొడుకు కోసం ఆ నల్లజాతి మహిళ ఎంత ఏడుస్తోందో... పాపం!"

"నిజమే! మీరు చెప్పినట్టు చెయ్యాల్సింది. కాని సమయానికి ఆ కుర్రాడి బంధువులెవరూ కనబడలేదట. పైగా అది యూరోపియన్ల ఆసుపత్రి. నల్లజాతి వారికి ప్రవేశం ఉండదు. థాంప్సన్ గారు తీసుకెళ్ళారు కాబట్టి చూడనైనా చూశారు. అందువల్ల శవాన్ని ఎక్కువసేపు ఉంచితే జాతిపరమైన కొత్త ఇబ్బందులు, సమస్యలూ వస్తాయని ఆసుపత్రి సిబ్బంది తొందరపడ్డారు. అయినా సద్దుమణగ లేదు. నల్లజాతి వారి గొడవతో పట్టణమంతా హడలెత్తిపోయింది. వీరికి ఆ కమ్యూనిస్టుగాళ్ళు ఎప్పుడూ తోడుంటారు. అదో తలనొప్పి" అన్నాడు పోలీస్ సూపరింటెండెంట్.



కొన్ని నెలల తర్వాత ఆ కేసు నా కోర్టు ముందుకొచ్చింది. బులవాయోలో నివసించే వ్యాపారవేత్త జార్జ్ థాంప్సన్ ఒక ప్రమాదకరమైన ఆయుధాన్ని నిర్లక్ష్యంగా పట్టుకోవడం వల్ల అనూహ్యంగా ఒక నల్లజాతి కుర్రవాడు చనిపోయాడనేది అభియోగం! ప్రాసిక్యూషన్ లాయరుగా సర్ చార్లెస్ బ్రంటన్‌ను నియమించారు. అంతకుముందు సంవత్సరమే ఆయనకు ఘనత వహించిన మహారాణిగారి జన్మదినోత్సవం నాడు 'సర్' బిరుదు లభించింది. అయినా కమ్యూనిస్టులు, నల్లజాతి అలగాజనం ఆయన్ని నమ్మక, అసలు విషయం బయటికి రావాలనే ఉద్దేశంతో ఒక భారతీయ లాయర్‌ను నియమించుకున్నారు. చనిపోయిన కుర్రాడి తల్లి తరపున తాను వాదిస్తానని, నిర్భయంగా ఉండండని ఆ భారతీయ లాయర్ వారికి ధైర్యం చెప్పాడు.

కాని ఆ భారతీయ లాయరు ఒట్టి తలతిక్క మనిషిలా ఉన్నాడు. ఫీజు ఎంత తీసుకున్నాడో తెలియదు గానీ... భారతీయుడికుండే తలపొగరుతో థాంప్సన్ దొర వారినే బోనులో నిలబెట్టాడు. పైగా నానా ప్రశ్నలు గుప్పించి ఇబ్బంది పెట్టాడు. థాంప్సన్ తక్కువ వాడా ప్రతి ప్రశ్ననూ తిప్పికొట్టాడు.

"థాంప్సన్ గారూ! తుపాకి గుండు తగిలిన నల్లజాతి కుర్రవాణ్ణి మీరు ఏ యూరోపియన్ ఆసుపత్రికి తీసుకెళ్ళారో అక్కడే మీ శ్రీమతి కూడా చికిత్స పొందుతూ ఉందని తెలిసింది. దానికి మీరేమంటారు?

ఈ ప్రశ్నకు డిఫెన్స్ లాయర్ అభ్యంతరం చెప్పారు. కేసుకూ, ఈ విషయానికీ సంబంధం లేదన్నారు సర్ చార్లెస్ బ్రంటన్. ఇంతలో థాంప్సన్ కల్పించుకుని "నన్ను సర్ అని మాత్రమే సంబోధించు! థాంప్సన్ అని పేరు పెట్టి పిలవొద్దు" అన్నాడు.

భారతీయ లాయరు సన్నగా నవ్వుకుని నావైపు చూసి, "నేనా ప్రశ్న ఎందుకు అడగాల్సి వచ్చిందో ఇప్పుడే వివరిస్తాను మిలార్డ్! నన్ను అనుమతించండి" అని అభ్యర్థించాడు.

నేను అనుమతించాను. భారతీయ లాయరు మళ్ళీ ముద్దాయి థాంప్సన్ వైపు తిరిగి ప్రశ్నించాడు.

"సరేనండి అయ్యగారూ! కరుణించి నా చిన్న ప్రశ్నకు అవునా కాదా అన్న విషయం సెలవివ్వండి. ఆ రోజు తమరి భార్యగారు ఆ యూరోపియన్ ఆసుపత్రిలో ఉన్నారా? లేరా? చికిత్స తీసుకున్నారా? లేరా చెప్పండి."

"ఆ.. ఉన్నారు"

"మూత్రపిండం చెడిపోవడంతో ఆమె అక్కడ చికిత్స చేయించుకున్నారు కదా?"

"వైద్యానికి సంబంధించిన ప్రశ్నలు నన్ను అడగొద్దు. నేను వైద్యుణ్ణి కాదు" విసురుగా బదులిచ్చాడు థాంప్సన్.

"అయ్యా థాంప్సన్ దొరవారూ, మీకు కోపం తెప్పిస్తే మన్నించండి. మీరు గతంలో చెప్పిన విషయాన్నే నేను అడుగుతున్నాను. గత సెప్టెంబర్ 17న రొడీషియా హెరాల్డ్ పత్రికలో తమరు ఒక ప్రకటన చేస్తూ... సరిగ్గా ఆ పదమే ఉపయోగించారు. అదేమంటే మూత్రపిండం చెడిపోయి మీ భార్యగారు బాధపడుతున్నారని, ఎబి గ్రూపుకు చెందిన రక్తం గలవారెవరైనా దయతో ముందుకొచ్చి మూత్రపిండం దానమీయండని తమరు ఆ ప్రకటనలో కోరారు. భారీగా పారితోషికం కూడా ప్రకటించారు."

**లాయరు వాదనని నేను శ్రద్ధగా వింటున్నాను... నేనే కాదు, కోర్టులో ఉన్న ప్రతివాడూ అత్యంత ఆసక్తిగా, ఉత్సాహంగా వింటున్నాడు. వెధవ! ఈ లాయరుగాడికి ఏదో చాతుర్యం ఉంది. పులిలాంటి థాంప్సన్‌ని పిల్లిలా మార్చేయడం, విషయాన్ని మలుపు తిప్పి అందరిలో ఉత్సుకతను పెంపొందించడం మామూలు విషయమేమీ కాదుగదా!**

నేను శ్రద్ధగా వింటున్నాను-

నేనే కాదు, కోర్టులో ఉన్న ప్రతివాడూ అత్యంత ఆసక్తిగా, ఉత్సాహంగా వింటున్నాడు. వెధవ! ఈ లాయరుగాడికి ఏదో చాతుర్యం ఉంది. పులిలాంటి థాంప్సన్‌ని పిల్లిలా మార్చేయడం, విషయాన్ని మలుపు తిప్పి అందరిలో ఉత్సుకతను పెంపొందించడం మామూలు విషయమేమీ కాదుగదా!

"ఆ ప్రకటన ఇచ్చింది డాక్టర్లు. అందులో ఏం రాశారో నాకు తెలియదు. అయితే బిల్లు మాత్రం నేనే చెల్లించాను."

"దొరవారు గొప్ప పని చేశారు. ఆ విషయం అట్లా ఉంచండి. ఆ ప్రకటనలోని విజ్ఞప్తికి ఎవరైనా స్పందించి ముందుకొచ్చారా?" ఎంత మూర్ఖుడనుకున్నా భారతీయ లాయరు మధ్య మధ్యలో తనదైన శైలిలో వ్యంగ్యం గుప్పిస్తున్నాడు. తమ లాయరు తమకు న్యాయం చేస్తాడన్న ఆత్మవిశ్వాసం నల్లజాతి వారి ముఖాలలో కనిపించింది.

"వెంటనే ఎవరూ స్పందించలేదు" అని చెప్పిన థాంప్సన్ ఒక నిమిషం ఆలోచించుకున్నాక "ఆ... ఒక పెద్దమనిషి వచ్చాడు శాలిస్‌బరీ నుండి... ఆయనే తన మూత్రపిండాల్లో ఒకటి దానమిచ్చాడు. ఫలితంగానే నా భార్య మృత్యుగండం లోంచి బయటపడింది."

"ఆ పెద్దమనిషి పేరూ, వివరాలూ కోర్టు వారికి అందివ్వగలరా?"

"ఇవ్వలేను. తన వివరాలు రహస్యంగా ఉంచమని ఆ పెద్దమనిషి నన్ను కోరాడు. అలాగేనని మాట ఇచ్చాను."

"మంచిది. అయితే మరో విషయంలోకి పోదాం. జోసెఫ్... అంటే మీ ఇంట్లో పని చేసే కుర్రాడు, ఆ నల్లజాతి మహిళ కొడుకు... ఊహించని రీతిలో మీ తుపాకి గుండు తగిలి చనిపోయాడు తప్ప మీరు కావాలని కాల్చి చంపలేదని అంటున్నారు."

"అవును" నిర్లక్ష్యంగా ఎటో చూస్తూ అన్నాడు థాంప్సన్.

"ఓ.కె. అయితే ఇది చెప్పండి. ఆ పిల్లవాడు చనిపోవడానికి ముందు రోజు వాణ్ణి మీరు ఆసుపత్రికి తీసుకెళ్ళి రక్తపరీక్షలు చేయించారా?"

థాంప్సన్ ఖంగుతిన్నాడు... అయినా సంబాళించుకున్నాడు.

"లేదే. వాడు తనంతట తానే వెళ్ళి ఉంటాడు"

"పోనీ వాడి రక్తం ఎబి గ్రూపుకు చెందిందేనా?"

"ఏమో వాడి రక్తం గ్రూపు నాకెలా తెలుస్తుంది? పైగా నల్లజాతి వారి రక్తం గ్రూపుల సంగతి నాకు తెలియదు. అలాంటి ప్రశ్నలు నన్ను అడగొద్దు."

భారతీయ లాయరు లోలోన నవ్వుకుని,

నావైపు ఓసారి చూసి... ఇక ఇప్పుడు చూడండి నా తడాఖా అన్నట్టు కోర్టు హాలంతా ఒకసారి తృప్తిగా పరికించి చూశాడు. అందరి దృష్టీ తన మీదే ఉందని గ్రహించాడు. కించిత్ గర్వంతో మళ్ళీ థాంప్సన్ వైపు తిరిగాడు.

కావాలనే "చూడు థాంప్సన్!"- అని సంబోధించి... "ఓ మరిచిపోయా తమరిని 'సర్' అని మాత్రమే సంబోధించాలి కదా?- చూడండి థాంప్సన్ దొరగారూ తమరి భార్యగారి కోసం ఒక మూత్రపిండాన్ని దానం చేస్తున్నట్లు మీ ఇంట్లో పని కుర్రాడి చేత... అంటే నల్లజాతి అబ్బాయి జోసెఫ్ చేత మీరు బలవంతంగా ఒక డాక్యుమెంటుపై సంతకం చేయించుకున్నారా? లేదా? మీరు అబద్ధం చెప్పినా చెల్లదు. ఎందుకంటే దాని నకలు ప్రతి నా దగ్గరుంది" కఠినంగానే అన్నాడు లాయరు.

"నేను ఇదివరకే చెప్పాను శాలిస్‌బరీ నుంచి వచ్చిన పెద్దమనిషి తన మూత్రపిండం ఇచ్చి నా భార్యను కాపాడాడని."

"థాంప్సన్ మహాశయా! మీరు అద్భుతాలను బాగా నమ్ముతారనుకుంటాను. శాలిస్‌బరీ పెద్దమనిషి సరిగ్గా మీ పని కుర్రాడు కాల్చి చంపబడిన రోజునే వచ్చి... పని పూర్తి చేసి, ఆ సాయంత్రమే ఎవరికీ కనబడకుండా తిరిగి వెళ్ళిపోయాడా?

ఆ ప్రశ్న థాంప్సన్ నసాళానికి అంటింది.

"ఏమిటా వ్యంగ్యం?" కోపంగా ఊగిపోయాడతను. కాని, తను ఆ సమయంలో కోర్టు బోనులో ఉన్న విషయం గుర్తొచ్చి నిగ్రహించుకుని, పెద్దమనిషి తరహాలో బదులిచ్చాడు.

"రొడేషియా న్యాయవ్యవస్థ మీద నాకు గొప్ప గౌరవం. అందుకే నీలాంటి సామాన్యులక్కూడా జవాబులు చెప్పడానికి బోనులో నిలబడ్డాను. జోసఫ్ అనే నల్లజాతి పని కుర్రాడు ఆక్సిడెంట్‌లో చనిపోయాడు. వాణ్ణి ఎవరూ కాల్చి చంపలేదు. అది గుర్తుంచుకుని మాట్లాడితే మంచిది" థాంప్సన్ బోనులో ఉండి కూడా హుంకరించాడు.

"సర్! అలాగే సర్!! ఆ వచ్చిన పెద్దమనిషి ఉదయమే వచ్చి పదకొండు గంటలకు మూత్రపిండాన్ని కోయించుకుని, మళ్ళీ మధ్యాహ్నం మూడు గంటలకల్లా విమానం ఎక్కి శాలిస్‌బరీకి తిరిగి వెళ్ళిపోయాడన్నమాట! అంతేనా అదేనా మీరు చెప్పేది!"

"నన్ను మళ్ళీ వైద్యశాస్త్రంలోకి లాగుతున్నావ్"

"మహాప్రభో! ఇది వైద్యశాస్త్రానికి సంబంధించిన విషయం కానే కాదు. తమరు సహకరించాలి. ఆ పెద్దమనిషి... ఆపరేషన్ అయినవాడు... మూడు నాలుగు గంటల వ్యవధిలోనే విమానం ఎక్కి తిరిగి శాలిస్‌బరీకి తనకు తానుగా వెళ్ళిపోయాడా అని అడుగుతున్నానంతే."

"ఔను వెళ్ళిపోయాడు"

"తమరి భార్యగారు మాత్రం ఆపరేషన్ అయిన తర్వాత పదిహేను రోజుల వరకు ఆసుపత్రిలోనే ఉన్నారనుకుంటాను. నిజమే కదండీ?"

"నాకు సరిగా గుర్తులేదు. కానీ, తను ఆసుపత్రిలో చాలా రోజులే ఉంది"



"మిలార్డ్"- అంటూ లాయరు నావైపు చూశాడు. "నేను కోర్టు ముందు కొన్ని పచ్చి నిజాలు ఉంచ బోతున్నాను. వాటిని సరి అయిన రీతిలో పరిశీలించ వలసిందిగా వేడుకుంటున్నాను" అన్నాడు.

తర్వాత థాంప్సన్ వైపు తిరిగి "అయ్యా! థాంప్సన్ దొరవారూ! ఇప్పుడు మీరు వెలగబెట్టిన నిర్వాకం తెలియజేస్తున్నాను. వినండి! శాలిస్‌బరీ నుంచి వచ్చిన పెద్దమనిషంటూ ఎవరూ లేరు. జోసఫ్ అనే నల్లజాతి పిల్లవాణ్ణి మీరు మోసగించారు. తన ఇష్టపూర్వకంగా మూత్రపిండం దానం చేస్తున్నానని అతనితో బలవంతంగా సంతకం తీసుకున్నారు. వాణ్ణి మీరు భయపెట్టారు. వాడు భయపడి మీ నుండి దూరంగా పారిపోతూ ఉంటే మీరు తుపాకీతో కాల్చి చంపారు. ఆ దశలో వాణ్ణి మీరు ఆసుపత్రికి తీసుకెళ్ళి, మీ కనుసన్నల్లో పనిచేయగల డాక్టర్ల బృందంతో వాడి మూత్రపిండం కోయించి, మీ భార్యకు అమర్చించుకున్నారు. విషయం బయటికి పొక్కకుండా వాడి శరీరం పాతి పెట్టించారు. మీరు తీసుకున్నది నల్లవాడి 'నల్ల కిడ్నీ' అయినా, మీకు ఎటువంటి ఏహ్యభావం కలగలేదు. మీరు నల్లవాళ్ళను అసహ్యించుకుంటారు కానీ, మీకు పనికొచ్చే వారి అవయవాలను కాదు గదా?"

కోర్టులో పెద అలజడి మొదలయ్యింది. అల్లరి చేస్తున్న నల్లజాతివారినందరినీ నేను బలవంతంగా బయటికి పంపించాల్సి వచ్చింది. ఆ పొగరుబోతు భారతీయుణ్ణి ఇక వాదన ఆపుచేసి ఓ మూల కూర్చోమన్నాను. అవసరమైనప్పుడు అధికారాన్ని ఉపయోగించుకోవాలి కదా? అయినా ఎన్నేళ్ళు బోధించినా భారతీయులు, నల్లజాతి వారు బ్రిటిష్ న్యాయశాస్త్రంలోని మెళకువలను తెలుసుకోలేరు. ఈ భారతీయ లాయరు ఒక పెద్ద వెర్రి వెంగళప్ప అనే విషయం నాకు ముందు నుండే తెలుసు. కానీ, ఇవ్వాల్సిన చోట అవకాశం ఇచ్చి చూడాలి కదా ఈ కేసునే చూడండి.. ఏమైంది! సాదాసీదాగా ఉన్న ఒక చిన్న కేసును జాతుల మధ్య వైషమ్యాలు పెంచేదిగా; ధనిక, పేద తారతమ్యాల్ని బేరీజు వేసేదిగా; రాజకీయాలు చర్చించేదిగా... కేసు ఎన్ని రకాలుగా మారిపోయిందో చూడండి! ఇదంతా ఆ నల్లజాతి అలగా జనం, కమ్యూనిస్ట్‌గాళ్ళూ అనాగరికంగా వాదించగల ఓ మూర్ఖ భారతీయ లాయర్ను పట్టుకురావడం వల్లే జరిగింది. అందరూ కలిసి ఇప్పుడీ కేసును ఒక బ్రహ్మ పదార్థంగా తయారు చేశారు.

ఏది ఏమైనా బ్రిటిష్ న్యాయవ్యవస్థ చెడిపోగూడదన్నది నా అభిమతం. అందుకే నా పరిధిలో నేను రొడేషియాలో న్యాయదేవత తలెత్తుకునేట్లు తీర్పు ఇచ్చాను. థాంప్సన్‌కి ఆ రోజు కోర్టు ముగిసేవరకూ జైలుశిక్ష విధించాను. వెంటనే అమలు చేయించాను కూడా... అంతేకాదు, రెండు వందల పౌనుల జుర్మానా కూడా విధించాను. ఆ సొమ్ము నల్లజాతి కుర్రాడి తల్లికి చెల్లించాలని ఆదేశించాను. కాని ఆ నల్లజాతి మహిళ డబ్బులు తీసుకోకుండా, కోర్టువైపు చూస్తూ ఉమ్మేసి, తిరిగి చూడకుండా వెళ్ళిపోయిందట! కమ్యూనిస్ట్‌గాళ్ళు నినాదాలు చేస్తూ కోర్టు ఆవరణలోంచి బయటికి ఊరేగింపుగా వెళ్ళారట. నేనిచ్చిన తీర్పుకు బహుళ ప్రచారం కలిగించాలని కాబోలు!! ఆ తర్వాత ఆ పొగరుబోతు భారతీయ లాయరు ఏమయ్యాడో ఎవరికీ తెలియదు. ఏమైనా జరిగితే అది వాడికి వాడు చేసుకున్నదేనని మాత్రం అర్థం చేసుకోవాలి.

ఇదంతా అట్లా ఉంచితే, థాంప్సన్ భార్య అందంగా, ఆరోగ్యంగా, హాయిగా తిరుగుతోంది. ఏదో పార్టీలో కనిపించింది. నల్లజాతి వాడి కిడ్నీతో బతుకుతోందని ఆమె స్నేహితురాళ్ళు ఆమెను ఏడిపిస్తున్నా దానికి ఆమేమీ చిన్నబుచ్చుకోవడం లేదు. సరదాగా, ఠీవిగా, విజయగర్వంతో వారికో సవాలు విసురుతున్నట్టు నవ్వుతోంది!

**అనువాదకుని మొబైల్ : 99086 33949**

# కృష్ణ అభిమానులకు పండగ

తెలుగు సినీరంగంపై చెరగని ముద్ర వేయడంతో పాటు ఎందరో నూతన నటీనటుల్ని, సాంకేతిక నిపుణుల్ని పరిచయం చేయడం ద్వారా వారి అభివృద్ధికి సహాయం చేశాడని సూపర్‌స్టార్ కృష్ణ గురించి రేణూశరన్ తన 'హిస్టరీ ఆఫ్ ఇండియన్ సినిమా' పుస్తకంలో ఒకే ఒక్క వాక్యంలో చెబుతుంది. కృష్ణ వేసిన ఆ చెరగని ముద్ర వెనక ఉన్న కృషినీ, కష్టాన్నీ, అదృష్టాన్నీ ఆయన నటించిన 365 సినిమాల నేపథ్యంలో రికార్డు చేసిన పుస్తకం సీనియర్ జర్నలిస్ట్ వినాయకరావు రాసిన/ సంకలనం చేసిన 'దేవుడు లాంటి మనిషి'. ఆల్బమ్ సైజులో 560 పేజీల్లో వెలువడిన ఈ పుస్తకంలో కృష్ణ నటించిన అన్ని సినిమాల కథాంశాలు, నిర్మాణ విశేషాలు, తారాగణ సాంకేతిక నిపుణుల వివరాలతో పాటు ఆయా చిత్రాలకు సంబంధించిన అరుదైన ఫోటోలు, వాల్‌పోస్టర్లు, పత్రికా ప్రకటనలు వంటివన్నీ కూడా ఉన్నాయి. వీటన్నిట్నీ సేకరించి ఒక్కచోట ప్రచురించడం చాలా శ్రమతో కూడిన విషయం.




దక్షిణ భారతదేశానికి దేశవాళీ జేమ్స్‌బాండ్ ఎలా ఉంటాడో తొలిసారి రుచి చూపించిన నటుడు కృష్ణ. జమున, కె.విశ్వనాథ్, ఎస్.పి. బాలు, దాసరి, కె. రాఘవేంద్రరావు, కృష్ణంరాజు, శ్రీదేవి, జయసుధ, రజనీకాంత్, వెంకటేష్, పరుచూరి బ్రదర్స్ వంటి ఎందరో నటదర్శక సాంకేతిక నిపుణులు కృష్ణపై రాసిన వ్యాసాలు ఆయన బహుముఖ వ్యక్తిత్వాన్ని, ప్రజ్ఞను పాఠకులకు అర్థం చేయించి కొండకచో ఆశ్చర్యపరుస్తాయి. కృష్ణ అందరిలాగా కేవలం నటుడు కాదని చెపుతూ దేవుడు లాంటి మనిషెలా అయ్యాడో వివరిస్తాయి.

**కథల్ని ఎన్నుకోవడంలో కృష్ణ చూపించే వైవిధ్యం, ప్లస్ ఆ కథకు సాంకేతికతను అడాప్ట్ చేసే అతని అత్యాధునిక ధోరణి (ఆ రోజుల్లో) ఆశ్చర్యపరచడమే కాదు ఆలోచింపజేస్తుంది. ఎంతో కొంత ధార్మిక ఆవేశం, ప్రేమ ఉంటే తప్ప సినిమాను కేవలం వ్యాపారంగా భావించే వారికి ఇది ఎప్పటికీ సాధ్యం కాదు.**

ఫ్యామిలీ, డ్రామా, భక్తి, జానపదాలతో నిండి ఊపిరి ఆగిపోయే దశలోని తెలుగు సినిమానూ, యాంత్రిక నీతిబోధన కథనాలతో వృద్ధులైన తెలుగు ప్రేక్షకులనూ కృష్ణే మొట్టమొదటగా తన కౌబాయ్, జేమ్స్‌బాండ్, సస్పెన్స్ థ్రిల్లర్, యాక్షన్, అపరాధ పరిశోధన, నిధి అన్వేషణ కథనాలతో పారడిమ్ షిఫ్ట్‌కు గురి చేసి, సినీ సాంప్రదాయాలను బద్దలుకొట్టి, సినిమాకు కొత్త తరం ప్రేక్షకులను సృష్టించి పరిశ్రమను కాపాడి పునరుజ్జీవింప జేశాడు. దాంతో అప్పటిదాకా తెరమీద వీరవిహారం చేసిన కత్తులు, బల్లాలు, డాళ్ళు, పచ్చల పిడిబాకులు, బాణాలు ఒక్కసారిగా స్టూడియో ఫ్లోర్ గోడౌన్లలో శాశ్వతంగా నిద్రించాల్సి వచ్చింది. మహామహానటులే కొత్త కథల గురించి వెతుక్కోవాల్సిన సందర్భాన్ని సృష్టించాడు. ఎందరో దర్శక, రచయితలు కొత్త కథలను రాసుకోవాల్సిన పరిస్థితిని కల్పించాడు.

నిజానికి సినీ విమర్శకులు, పండితులు (అసలెవరైనా ఉన్నారా?) కృష్ణ కాలాన్ని ముఖ్యంగా 70ల కాలాన్ని సరిగ్గా నమోదు చేయలేదు కానీ చేసి ఉంటే అప్పటి రెగ్యులర్ సినిమాలు ప్రేక్షకుల మనస్సులో ఏర్పరచిన సంప్రదాయ ఆలోచనాసరళిని ఆయన సినిమాలు తీవ్రంగా కుదిపేసిన విషయం రికార్డయి ఉండేది. 'శివ' కంటే ముందుగా జరిగిన పరిణామాలివి. అవే కృష్ణకు శక్తివంతమైన అభిమానగణాన్ని సంపాదించిపెట్టాయి. మరో రకంగా చెప్పాలంటే తన ముందు కాలం నాటి మూసను బ్లాస్ట్ చేయడం ద్వారా చిరంజీవి లాంటి తన తర్వాతి కాలపు నటుల రాకను సుగమం చేశాడు కృష్ణ. అలాగే పాత్రల ఎంపికలో ఆయన అనవసర భేషజాలకు, అర్థం లేని అహంకారాలకు పోనందున తెలుగు ప్రాంతాలలోని ఎన్నో బహుజన కులాలవారు కృష్ణ పాత్రలతో ఐడెంటిఫై కాగలిగారు.

కథల్ని ఎన్నుకోవడంలో కృష్ణ చూపించే వైవిధ్యం, ప్లస్ ఆ కథకు సాంకేతికతను అడాప్ట్ చేసే అతని అత్యాధునిక ధోరణి (ఆ రోజుల్లో) ఆశ్చర్యపరచడమే కాదు ఆలోచింపజేస్తుంది. ఎంతో కొంత ధార్మిక ఆవేశం, ప్రేమ ఉంటే తప్ప సినిమాను కేవలం వ్యాపారంగా భావించే వారికి ఇది ఎప్పటికీ సాధ్యం కాదు. సినిమా పట్ల కృష్ణలోని ఈ ధార్మిక ఆవేశాన్ని కూడా దశలు దశలుగా అర్థం చేయిస్తుందీ పుస్తకం. ఒక్క మాటలో చెప్పాలంటే కృష్ణ కంప్లీట్ మూవీ డేటాబేస్ ఈ పుస్తకం.

విశ్లేషణలు లేకపోవడం, ఇంటర్వ్యూలు ఎక్కువ కావడం, 365 సినిమాలకు పేర్ల సూచీ ఇవ్వకపోవడం, కృష్ణ అభిమానులకు అందుబాటులో లేని ధర పెట్టడం వంటి లోపాలున్నా, 365 ఆసక్తికర సినీ కథాంశాలున్న ఈ సినిమాటిక్ టెక్స్ట్ సినిమా పరిశోధకులను, ప్రేమికులను, పాఠకులను, అభిమానుల్ని కూడా ఒకేరకంగా చదివిస్తుంది. కృష్ణతోపాటు ఆ కాలంలో వికసించిన సామూహిక ప్రతిభను కూడా పరోక్షంగానైనా సామాజిక-చారిత్రక కారణాలతో సహా అర్థం చేయించే మంచి పుస్తకమిది.

**- డాక్టర్ లెనిన్ ధనిశెట్టి**

**దేవుడులాంటి మనిషి**, యు. వినాయకరావు
**పేజీలు :** 560, **వెల :** రూ. 1200
**ప్రతులకు :** 99854 11019

---

**తెలంగాణ కథకుల**
**కథాంతరంగం**
**రచన :** గోపగాని రవీందర్
**పేజీలు :** 96,
**వెల :** రూ.100
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు




**తెలంగాణ కోటలు**
**రచన :** నాగబాల సురేష్‌కుమార్
**పేజీలు :** 144,
**వెల :** రూ.150
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు




**విష్ణు పద**
**రచన :** డా. టి. శ్రీరంగస్వామి
**పేజీలు :** 110,
**వెల :** రూ.100
**ప్రతులకు :** నవచేతన బుక్ హౌస్



## కొత్త పుస్తకాలు

## ఆత్మీయతా ప్రవాహం



ఆకాశాన్ని చూస్తూ చెట్టు ఎంత ఎత్తు ఎదిగినప్పటికీ వేర్లు ఉండాల్సింది మట్టిలోనే. అలాగే సమాజంలో ఎన్ని రకాల కథలు పుట్టినా అవన్నీ మనుషుల చుట్టూ, వారి మనసుల చుట్టూ తిరగాల్సిందే. మానవీయ విలువల్ని స్పృశిస్తూ, నిన్నటి తరాన్ని గుర్తుచేస్తూ, వర్తమానాన్ని అర్ధమనసుతో అంగీకరిస్తూ, భావి తరాల గురించి ఆలోచింపజేసే కథల సంపుటి 'అమ్మమ్మే గోదావరి'. ముగ్గురు రచయితలు తలా ఎనిమిది కథల చొప్పున రాసి ప్రచురించారు.

పుట్టిన మనిషి కన్నుమూయడం తథ్యం. కానీ ప్రతి మనిషి మరణం వెనుక సుదీర్ఘమైన ప్రయాణం ఉంటుంది. కొన్ని వేల, లక్షల అనుభవాలుంటాయి. అలాంటి అనుభవాలను జాగ్రత్తగా ఏరి కథలుగా మలిచారు యర్రమిల్లి విజయలక్ష్మి. అమ్మమ్మ కొంగుపట్టుకు తిరిగిన 'ప్రవాహం', ఆదరించిన తల్లి దూరమైనప్పుడు 'కన్నీటికి కరువు', చిన్నారి 'ఆర్తి', ప్రాణంలాంటి 'అమ్మచెట్టు' అలా రాసిన కథలే. చేయిపట్టుకుని తీసుకెళ్లి 'ఇక్కడిలా జరిగింది ...' అని మనకు ప్రతి విషయాన్నీ వివరిస్తున్నట్టుంటాయి ఆవిడ కథలు.

యాచకవృత్తిలో ఉన్న 'లచ్చిమి' , 'ఉచ్చు'లో దిగిన ఆడపడుచు, ఒకప్పటి వైభవాన్ని చెప్పే 'ఇనప్పెట్టె', 'పెట్టెచీకుడు' బతుకు బతికిన గనిరాజు వీళ్లంతా మనకు అక్కడక్కడా తారసపడుతూనే ఉంటారు. ఈ కథలన్నీ జయసూర్యవి. సమాజం పట్ల ఆయనకున్న నిశిత పరిశీలనకు తార్కాణాలు ఈ కథలు.

కల్లా కపటం లేని పసి మనసులను, పశు పక్ష్యాదుల పట్ల మానవాళికి ఉండాల్సిన దయను శాంతి ప్రభాకర్ చాలా సరళంగా ఆవిష్కరించారు. తేనెటీగలను బిడ్డల్లా పెంచిన ముసలమ్మ 'వారసత్వం', కన్నకూతురు అభిప్రాయానికి విలువిచ్చిన 'రెండుగాజులు ... పదిగ్రాములు... ఆరువేల రూ.లు', వలసవచ్చిన పక్షి 'అతిథి', గోమాతను కన్నతల్లిగా భావించే భారతీయ సంస్కృతి 'రెండవ వైపు' ఆయన వస్తు వైవిధ్యాన్ని చాటుతాయి.

**- డా. చల్లా భాగ్యలక్ష్మి**

**అమ్మమ్మే గోదావరి**,
యర్రమిల్లి విజయలక్ష్మి, సూర్యనారాయణమూర్తి, ప్రభాకరరావు
**పేజీలు:** 160, **వెల :** రూ. 120,
**ప్రతులకు:** నవోదయ, హైదరాబాద్

---

## మొరుసునాడు మట్టి వాసన

ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాల సరిహద్దుల్లోని తెలుగువాళ్ళ కథల పుస్తకమిది. ఈ కథల్లో రైతులు, ఎడ్లు, పంటలు, కష్టాలు, కన్నీళ్ళే కాదు... వారి జీవితాలతో పెనవేసుకుపోయిన కళల గురించి కూడా రచయితలు అపురూపంగా వ్యాఖ్యానించారు. రామక్కగారి సుమ రాసిన 'బానమ్మ ఏడిసింది' కథ ఓ జానపద కళాకారిణి కడగండ్లను ఆవిష్కరించి కంటతడి పెట్టిస్తే, పల్లె పండుగల్లో కేళిక (వీధి భాగోతం) ప్రాధాన్యతను వివరిస్తుంది బడిగోళ్ళ సత్యనారాయణ 'వెతికితే సిక్కుతుందా' కథ. కళాకారుడు కళాకారుడుగా కొనసాగలేని దీనస్థితిని రఘునాథ 'పాట్లోడు కూలోడా?' కథలో కళ్ళ ముందుంచుతారు. పాట పాడితే కనీసం ఒక్కాకు ఇచ్చేవారు కూడా లేకపోవడంతో పనుల్లో చేరి పాటలు మర్చిపోయిన అన్నప్ప జీవితం ఆవేదన కలిగిస్తుంది. సెల్‌ఫోన్ మానవ సంబంధాలను ఎలా విచ్ఛిన్నం చేస్తోందో అత్యంత సహజంగా చెబుతుంది పోకల చెన్నకేశవులు 'కలిపేదా, ఉలిపేదా' కథ. ఎత్తుగడలు, నిర్మాణ శైలి విన్యాసాలు వంటివేమీ లేకుండా అచ్చం పల్లెల్లాగా, పల్లెల్లోని అట్టడుగు బతుకుల్లాగా అతి సామాన్యంగా సాగుతూ వాస్తవ దృశ్యాలను కళ్ళెదుట నిలుపుతుందీ పుస్తకం.

**- దేరా**

**రాగెన్నుల రాజ్జెం** - మొరుసునాడు కతలు
**పేజీలు :** 120, **వెల :** రూ. 100,
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

---

## 'సాక్షి' ఒక మంచి సినిమా



బాపు దర్శకత్వం వహించిన తొలి సినిమా 'సాక్షి'ని అన్ని కోణాల్లోనూ సమగ్రంగా చర్చించారు రచయిత ఈ పుస్తకంలో. 'సాక్షి'కి మూలచిత్రమైన 'హై నూన్'తో మొదలు పెట్టి ఎన్నో అంశాలను సాకల్యంగా వివరించారు. రెండు సినిమాల సంక్షిప్త కథలూ, తెలుగుదనాన్ని అద్దే క్రమంలో చేసిన మార్పులు, ఈ సినిమా తరవాతే కృష్ణ, విజయనిర్మల వివాహం చేసుకోవడం వంటి విశేషాలన్నీ ఇందులో ఉన్నాయి. అందరూ భయపడి వదిలేసిన పరిస్థితుల్లో ఒక రౌడీని ఒక అమాయకుడు తప్పనిసరై ప్రతిఘటించిన తీరు ఈ రోజుకీ తెలుసుకోదగ్గ అంశమే. ఆధునికం అనుకోవడం తప్ప నిజానికి అప్పటికి, ఇప్పటికి పరిస్థితుల్లో మార్పు లేదు. నాడూ నేడూ బలవంతుడిదే రాజ్యం. దర్శకత్వానికి తోడు స్క్రీన్‌ప్లే సమకూర్చిన బాపు, రచయిత రమణ స్క్రిప్టును అవసరానుగుణంగా ఎలా మార్చుకున్నారో చక్కగా తెలియజేశారు. దీన్ని చిన్నపాటి పరిశోధనగా భావించవచ్చు.

**- మద్దిపట్ల మణి**

**మళ్ళీ సాక్షి నామ సంవత్సరం**, డా. కంపల్లె రవిచంద్రన్
**పేజీలు :** 120, **వెల :** రూ.120, **ప్రతులకు :** నవోదయ, విశాలాంధ్ర

---

## విజయానికి దారిది...




సామాజిక, ఆర్థిక రంగాల్లో వేగంగా చోటుచేసుకుంటున్న మార్పుల ప్రభావం మానవసంబంధాలపైనా, కుటుంబ సంబంధాలపైనా తీవ్రప్రభావం చూపిస్తున్నాయి. లక్ష్య రాహిత్యం, అకారణమైన ఆత్మన్యూనత, స్వీయ బలంపై అనుమానాలు, అభద్రత, యుద్ధంలోకి అడుగుపెట్టకుండానే అస్త్రసన్యాసం చేసే బేల వైఖరి...లక్షలాది మంది యువతీ యువకులను ఉజ్వల భవిష్యత్తుకు దూరం చేస్తున్నాయి. కొన్ని సందర్భాల్లో కుటుంబాలనూ సంక్షోభాల్లోకి నెడుతున్నాయి. పోటీ ప్రపంచంలో నిలదొక్కుకోవడం, నిరూపించుకోవడం ఆధునిక యువతకు నిత్యసమరంగా మారింది. ఈ సమరంలో నెగ్గడానికి ఎవరికి వారే సన్నద్ధం కావాల్సొస్తోంది. కుటుంబం నుంచి, సమాజం నుంచి అన్ని సందర్భాల్లో మద్దతు లభించే అవకాశం ఏ కొందరు అదృష్టవంతులకో తప్ప ఉండటం లేదు. డాక్టర్ సి వీరేందర్ ఈ అంతరాన్ని పూరించే ప్రయత్నాన్ని వృత్తిగా, ప్రవృత్తిగా 'యూ అండ్ మీ' ద్వారా చేపట్టారు. సుదీర్ఘమైన తన అనుభవం నుంచి పోటీ పరీక్షలకు సిద్ధమవుతున్న అభ్యర్థులను మోటివేట్ చేసేందుకు, వారిలో స్ఫూర్తిని విశ్వాసాన్ని నింపేందుకు ఆయన 37 వ్యాసాలతో ప్రచురించిన పుస్తకం 'విజయానికి దారిది.'

**- వి. శ్రీనివాస్**

**విజయానికి దారిది**, సి. వీరేందర్
**పేజీలు :** 160, **వెల :** రూ.150, **ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు, 94400 37291

# సొరియాసిస్ మళ్లీ జీవితంలో రాదు

**నా పేరు స్రవంతి.** నాకు 34 ఏళ్లు. 6 ఏళ్ల క్రితం నాకు చుండ్రు సమస్య మొదలయ్యింది. ఆ కారణంగా షాంపూలు వాడటం మొదలెట్టాను. ఆ తర్వాత రెండేళ్ల నుంచి తలనుంచి పొట్టు రాలడం, బాగా దురద రావడం, వెంట్రుకలు రాలడం మొదలయ్యింది. వరుసగా రెండురోజుల పాటు స్నానం చేయకపోతే తల దువ్వినప్పుడు చేపపొట్టులా వచ్చేది. ఎన్ని రకాల యాంటీ-డాండ్రఫ్ షాంపూలు వాడినా ఫలితం లేకపోయేది. ఒక సంవత్సరం తర్వాత మోచేతుల దగ్గరున్న, ఎర్రని గుళ్లలు ఏర్పడి బాగా దురద పెట్టేది. ఆ గుళ్లల్లోంచి పొట్టు కూడా రాలేది. చర్మం బాగా ఎండిపోయేది. అల్లోపతి డాక్టర్‌ను సంప్రదిస్తే కొన్ని మాత్రలు, పై పూత మందులు ఇచ్చారు. కొన్ని షాంపూలు కూడా ఇచ్చారు. వాటితో పొట్టు రాలడం, మచ్చలు తగ్గిపోయాయి.

ఆ తర్వాత మందులు ఆపేశాను. అంతే సమస్య మళ్లీ మొదటికొచ్చింది. మునుపటి సమస్యలన్నీ మళ్లీ మొదలయ్యాయి. ఈసారి మోచేతులకే కాకుండా మొత్తం శరీరమంతా పాకాయి. సమస్య నలుగురిలో కలవాలన్నా, ఏ పార్టీలకు వెళ్లాలన్నా నాలో ఒక తీవ్రమైన ఆత్మన్యూనతా భావన. నేరుగా ఏమీ అనకపోయినా అందరి చూపులు నన్ను కుంగదీసేవి. అందరూ నన్ను ఒక శాపగ్రస్తురాలిలా చూడటం నాకు జీవితంపై ఆసక్తి లేకుండా చేసింది. సరిగ్గా అదే సమయంలో ఆయుర్వేద వైద్య చికిత్సల ద్వారా సొరియాసిస్ నుంచి విముక్తి పొందిన ఒక వ్యక్తి మా వీధిలోనే తారసపడ్డారు. ఆమె ఆర్.కె ఆయుర్వేద, సొరియాసిస్ రీసెర్చ్ సెంటర్‌లో చికిత్స తీసుకుని ఆ వ్యాధినుంచి పూర్తిగా విముక్తిపొందిన విషయం వివరంగా చెప్పింది. ఆ నమ్మకంతో నేను మీ వద్ద వైద్య చికిత్సలు తీసుకోవాలనుకుంటున్నాను. నాకున్న ఈ సొరియాసిస్ వ్యాధిని నయం చేసి అందరూ అంటున్న ఈ శాపం నుంచి విముక్తి కలిగిస్తారా? అంటూ మాకు ఈ లేఖ అందింది. దానికి ప్రత్యుత్తరంగా మేము రాసిన లేఖకు ఆమె మావద్దకు వచ్చింది.

• • •

రెండేళ్ల క్రితం మా వద్దకు వచ్చిన స్రవంతి సమస్యను పరిశీలిస్తే ఆమె శరీరంలో పేరుకు పోయిన వ్యర్థపదార్థాల వల్ల శరీరం విషతుల్యమైపోయిందని మేము గుర్తించాం. దీనికి తోడు ఆమెలో మానసిక ఒత్తిళ్లు కూడా పెరగడంతో సమస్య మరింత తీవ్రమయ్యింది. ఆమెకున్నది సొరియాసిస్ అన్న నిజాన్ని గుర్తించడంలో చాలా ఆలస్యమైపోవడం వల్ల, ఇతర మందుల దుష్ప్రభావం వల్ల శరీర వ్యవస్థ అంతా అస్తవ్యస్థమయ్యింది. ఇంకా కొద్దిరోజులు ఇలాగే గడిస్తే, కీళ్లన్నీ వంకర్లు పోయే సొరియాటిక్ ఆర్థ్రైటిస్ సమస్య మొదలయ్యేది. ఏమైనా ఆమె మా వద్దకు రాగానే పంచకర్మ కిత్సలు చేసి ఆమెలోని వ్యర్థ, విషపదార్థాలను పూర్తిగా తొలగించి వేశాం. ఆ తర్వాత కడుపులోకి కొన్ని ఔషధాలు ఇచ్చాం. దీంతో మూలాలతో సహా వ్యాధి తొలగిపోయింది. 30 రోజుల చికిత్సలతో శరీరం మీదున్న సొరియాసిస్ మచ్చలన్నీ అదృశ్యమైపోయాయి.. ఆ తర్వాత వ్యాధి మళ్లీ రాకుండా వ్యాధి నిరోధక శక్తినిచ్చే రసాయనాలు ఇచ్చాం. దీంతో ఆమె సమస్య పూర్తిగా తొలగిపోయింది. ఆమె ఆనందానికి పట్టపగ్గాలు లేవు. అప్పటిదాకా ఆమెను ఒక పురుగులా చూసిన వారంతా ఆశ్చర్యంగా చూడటం మొదలెట్టారు. అభినందించడం మొదలెట్టారు.



**డాక్టర్ ఎస్. రామకృష్ణారెడ్డి**
**ఆర్.కె ఆయుర్వేదిక్ అండ్ సొరియాసిస్ రీసెర్చ్ సెంటర్**

| | |
|---|---|
| కూకట్‌పల్లి | 8886922245 |
| నాంపల్లి | 8886922247 |
| హన్మకొండ | 8886922248 |
| విజయవాడ | 8886922249 |
| వైజాగ్ | 8886922250 |
| కర్నూలు | 8886922251 |
| తిరుపతి | 8886922252 |

# ఆటిజానికి తిరుగులేని వైద్యం
# స్వర్ణామృతప్రాశన

**శారీరక** ఎదుగుదలతో సమానంగా, మానసిక ఎదుగుదల లేకపోవడమే ఆటిజం వ్యాధిలోని ప్రధాన సమస్య. తాము చేయాల్సిన పనేమిటో, చేయకూడనిదేమిటో తెలియని ఒక నిస్సహాయత ఆటిజం బాలబాలికల్ని పీడిస్తుంది. ఆటిజం పిల్లలకు రెండేళ్ల వయసొచ్చినా స్పందనలేమీ ఉండవు. అంత వయసొచ్చినా తల్లి దండ్రుల్ని గుర్తించలేరు. ఆటిజంలో వయసుతో పాటు రావల్సిన జ్ఞానమేదీ రాదు. విషయాల్ని గుర్తించే శక్తి ఉండదు. దీన్నే డిలేడ్ మైల్ స్టోన్స్ అంటారు. చివరికి పాకడం నడవడం కూడా బాగా ఆలస్యమే అవుతుంది. వీళ్లకు ఎవరితోనూ కలవకుండా ఒంటరిగా ఉండడాన్ని ఇష్టపడతారు. ఆటిజంలోనే కొంతమంది పిల్లల్లో అతిగా ప్రవర్తించే హైపర్ యాక్టివ్ లక్షణాలు కనిపిస్తాయి. కొంత మంది పిల్లలు దాదాపు మౌనంగానే ఉండిపోతే, మరికొంత మంది పిల్లలేమో విపరీతంగా అల్లరి చేస్తుంటారు.

**ఆటిజం కారణాల్లోకి వెళితే.....**

ఈ వ్యాధి రావడానికి వంశానుగతమైన మూలాలు కూడా పనిచేస్తాయి. ప్రసవ సమయంలో జరిగే కొన్ని పొరపాట్లు కూడా ఈ వ్యాధికి కారణమవుతాయి. శిశువుగా ఉన్నప్పుడు మెదడుకు తగిలిన గాయాలు కూడా ఆటిజం సమస్యకు కారణం కావచ్చు. తల్లి గర్భంలో ఉన్నప్పుడు ఎప్పుడూ ఒకేరకమైన ఆహార పదార్థాలు తీసుకోవడం కూడా ఇందుకు కారణం కావచ్చు.

**స్వర్ణామృత ప్రాశన వల్ల జరిగేదేమిటి?**

ఆటిజంలోని ప్రధాన సమస్య మెదడుకు శరీరానికి మధ్య సంబంధం తెగిపోవడం. అలా తెగిపోవడానికి మెదడు తన సహజమైన పటుత్వాన్ని కోల్పోవడమే కారణం. ఈ స్థితిలో స్వర్ణామృత ప్రాశన మెదడుకు శక్తిని ప్రసాదిస్తుంది. మొత్తం నాడీ వ్యవస్థను, మెదడులోని స్పీచ్ సెంటర్లను చైతన్యపరుస్తూ బాడీకి కనెక్ట్ అయ్యేలా చేస్తుంది. అందుకే స్వర్ణామృత ప్రాశన వాడటం మొదలెట్టిన మొదటి రెండు నెలలలోపల మాట రావడాన్ని గమనించవచ్చు. అసలే మాటల్లేని పిల్లల నోట కొన్ని మాటలు రావడాన్ని గమనించవచ్చు. , రెండు పదాలే మాట్లాడే స్థితి నుంచి వాక్య నిర్మాణం కోసం వారు పడే తపనను మనం గమనించవచ్చు. ఆ తర్వాత మూడో నెలనుంచి ఏదో ఒక్క వ్యక్తితోనే సన్నిహితంగా ఉండే స్థితిని తన చుట్టూ ఉండే ఆ నలుగురితోనూ కలిసిపోవడాన్ని మనం గమనించవచ్చు. నాలుగో నెలలో కాస్తంత అటెన్షన్ కూడా మొదలవుతుంది. ఎవరైనా పిలిస్తే పలకడం, ఏదైనా పని చెబితే చేయడం గమనించవచ్చు. ప్రతి సందర్భంలోనూ స్పష్టంగా మాట్లాడలేకపోయినా తొలుత సంజ్ఞల రూపంలోనైనా తన మనోభావాల్ని వ్యక్తం చేయడం మొదలవుతుంది. ఎవరి సాయం లేకుండా బాత్‌రూమ్, టాయిలెట్లకు స్వతంత్రంగా వెళ్లడం అలవడుతుంది. 5వ నెల వచ్చేసరికి అప్పటిదాకా ఉంటూ వచ్చిన హైపర్ యాక్టివ్ తత్వం తగ్గుముఖం పడుతుంది. మెల్ల మెల్లగా ఆ మొండితనం తగ్గిపోయి, బెరుకుతనం వదిలేసి, ఎదుటి వాళ్ల కళ్లలోకి సూటిగా, ఆత్మీయ దృష్టితో చూసే స్థితికి చేరుకుంటారు. ఆటిజంతాలూకు ఇతరత్రా లక్షణాలన్నీ ఒక్కొక్కటిగా తగ్గుముఖం పడతాయి. స్వర్ణామృతప్రాశనలో స్వర్ణభస్మంతో పాటు, ఆయుర్వేదానుసారం మనిషి మేధోశక్తిని పెంచే మేధోద్రవ్యాలు కూడా ఇందులో ఉన్నాయి. ఇవి ఆటిజం పిల్లల ఐ.క్యూ లెవెల్‌ను పెంచడంలో ఎంతో ఉపయోగపడతాయి. స్వర్ణామృతప్రాశనం ఆటిజంతోపాటు ఎడిహెచ్‌డి. హైపర్ యాక్టివిటీ డిజార్డర్‌లో నస్యకర్మతోపాటు కొన్ని ప్రత్యేకమైన చికిత్సలను అందుబాటులోకి తేవడం జరిగింది. అందువల్ల స్వర్ణామృతప్రాశన వాడుతూ, ఈ చికిత్సలనుతీసుకుంటే, అతి త్వరలోనే మంచి ఫలితాలు రావడం ఖాయం.

